

JANUARY 1979

జనవరి 1979

# సనాతన సారథి

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క-
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 జనవరి 1979 సంచిక 1



## విషయానుక్రమణిక



### చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-2-79" అనియుండిన, మీ చందా ఫిబ్రవరి నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సంIIనకు రూ. 6) జనవరి నెల 31 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

### -: శ్రీవారి కార్యక్రమములు :-

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.



సనాతన సారథి పాఠకులారా !

సత్యమేదో నిత్యమేదో బొత్తిగా తెలియని మిథ్యాలోకానికి, రక్తిని, విరక్తిని, శక్తిని, యుక్తముగా తెలిపి, సర్వమతముల సారము, సమస్త శాస్త్రముల భావమును అన్ని మార్గముల కేంద్రమూ ఆత్మవిచార మొక్కటే అని, సత్యధర్మ విధానములే సర్వవిషయములకు కీలకమని చక్కని ఆదర్శములతో ఉపమాన ఉపమేయములతో మానవత్వమునందున్న దివ్యత్వాన్ని, పవిత్రతను వ్యక్తము చేయుచు తర్క, కుయుక్తులకు చిక్కక, శుష్క వేదాంతమును వమ్ము చేయుచు, నిత్యజీవితములో సత్యజీవితాన్ని అనుభవించమని ప్రర్తినుండి పరవళ్ళు త్రొక్కుచూ, తాపమును తీర్చుచూ, దాహమును చల్లార్చుచు సనాతనసారథిని వారధిగా గైకొని ఇదిగో జనవరి సంక్రాంతి నుండే సాగివచ్చుచున్నది....

# సత్యసాయి వాహిని

-బాబా






భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

"కోహం? ముక్తిః కథం? కేన సంసార ప్రతిపన్నవాన్? ఇత్యాలోచన మర్థజ్ఞాస్తపశ్యం సన్తి పండితాః"

నేనెవరు? ఈ కర్తృత్వ మేమిటి? ఈ భోక్తృత్వ మెందులకు? జనన మరణాదు లెందులకు కలుగు చున్నవి? నాకీ సంసార మెట్లు ప్రాప్తించినది? ఇందుండి ముక్తి కలదా? ఇత్యాది విషయ విచారణయే మహాతపస్సని ఋషులు చెప్పెడివారు. ఇత్యాది విచారణప్రయత్నమను తపస్సు జీవుని యొక్క వివేకఫలితము. ఇది మొట్ట మొదటి మెట్టు. ఈ మెట్టు నెక్కినంతనే శాస్త్రవుపదేశమను దూత నాశ్రయించి, "శ్రోతవ్యో మంతవ్యోనిధి ధ్యాసితవ్యః" మొదలగు సోపానాల క్రమముగా దాటి గమ్యస్థానమగు ముక్తి పొందనగునని అనగా ఈ ద్వ జగతునుండి విడుదల మార్గము శ్రుతి చూపించుచున్నది. ఇట్టి మార్గ దర్శకుడు మార్గోపదేశకుడు భగవంతుడొక్కడే. అన్య గురువులు చేయజాలరు "సగురుమేవాభిగచ్ఛేచ్ఛ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అనగా శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠగలవాడును నగు గురువును మాత్రమే జేరవలెను అని శ్రుతి తెలుపుచున్నది. ఇక్కడ శ్రోత్రియుడు అగుటచే సదాచార సంపన్నుడు అనగా శ్రుతి యుక్తాచరణమున సంప్రదాయానుసారముగ మెలగువాడు. బ్రహ్మనిష్ఠుడనగా, సంశయ విపర్యయరహితుడు, నిశ్చలాత్మ జ్ఞాన సంపన్నుడు, లౌకిక జగత్తుతో యెట్టి సంపర్కములు లేక స్వయం బ్రహ్మస్వరూపముగ తలంచి, చరించి నిరూపించువాడు, త్రికాల వేద్యుడు, త్రిగుణాతీతుడు, ఏకాత్మ భావుడు, ఆనందమయుడు, ద్వంద్వాతీతుడు; ఇట్టి గురువును జేరుమని అని శ్రుతి తెలుపు చున్నది. ఇట్టి పై గుణములు కలవాడు సర్వేశ్వరుడు వక్కడు మాత్రమే కానీ తత్త్వవేత్తలయిన లౌకిక గురువులు కాదు అని మనము విశ్వసించవలెను.

యోగవాశిష్టమున శ్రీరామ చంద్రుడు వశిష్టుని అడిగిన ప్రశ్న కూడనూ ఇదియే. గురుదేవా! మృత్యువు బారినుండి తప్పించుకొను మార్గము కలదా?

గౌతమ బుద్ధుని విరాగోన్ముఖునిగా చేసి ఆతనిచే సర్వసంగ పరిత్యాగము చేయించి లోకోత్తమ పురుషునిగ ఖ్యాతి నొందించినది పై ప్రశ్నయేకదా!

పరమ భక్తాగ్రగణ్యుండైన ప్రహ్లాదుడు కూడను తోడి బాలురను పిలిచి, బాలకులారా మనప్రాయపు బాలురు కొందరు లోకమున కూలిపోవుట, కాలిపోవుట, రాలిపోవుట చూచితిరా? అనుచు మృత్యు ఘట్టమునే బాలుర దృష్టికి తెప్పించెను. మృత్యువననేమో జ్ఞానోపదేశము చేసెను.

కావున నిశ్రేయస ప్రాప్తిని కోరు వారందరును మృత్యువిచారము ప్రప్రథమమున సలుపుట అత్యవసరము. మృత్యువనగ భయమో లేక అమంగళమో అని వూహించరాదు. మృత్యువు ఇతరులకే కాని తనకు కాదని కానీ తలంచరాదు. మృత్యువిషయము ఇప్పుడెందులకు ఇది అప్రయోజనకరమని కానీ చింతించరాదు. మృత్యువిచారణ అనగా సాక్షాత్ తన పరమార్థమును గూర్చియే యని మానవుడు విశ్వసించవలెను.

వివేకమనగా దృశ్యమును లెస్సగా విచారించిదాని యథార్థమును, దాని స్వస్వరూపమును తెలిసికొను ప్రయత్నమే; "నేను యెవరు? అను ప్రశ్న జనించుటకు మృత్యువిషయమే మూల కారణము. కావున మృత్యు విషయమును విస్మరించరాదు, అలక్ష్యము చేయరాదు, భయపడి పారిపోరాదు. ఇదియే అజ్ఞాన ప్రప్రథమ సోపానము.ఆమాయకపు జీవితానికి అంకురార్పణము. మాయకు మహాబలము. మానవత్వము యొక్క పరమరహస్యమంతయూ మృత్యు విచారంతోనే ముడి పడి యున్నది. దైవచిద్విలాసమంతయూ మృత్యువు యొక్క పరిశీలన లోనే ప్రకాశించుచున్నది.

కఠోపనిషత్తు నందు నచికేతుడు యముని అడిగిన మూడు వరములలో మృత్యువిషయము ప్రధానవరముగా ప్రకాశించినది. మనుజుడు మరణించిన పిమ్మట వుండునా? కొందరు వుండుననియు, మరి కొందరు వుండడనియూ వారికి తోచినట్లు చెప్పుదురు. ఇందులో సత్యమెయ్యది? ఈ రహస్యమును నాకు తెలుపమని నచికేతుడు పట్టు పట్టినాడు. ఇందులకు సమాధానము నివ్వక యముడు, "నాయనా! నచికేతా! ఆరహస్యము అభేద్యము. శాస్త్రములు సూక్ష్మాతి సూక్ష్మములు. దేవతలకు కూడా తెలుపుటకు సాధ్యముకాని వరమును అడిగితివి. ఇట్టికోరిక నీకెందులకు? నీవు బాలుడవు, లోకమున యెన్నియో సౌఖ్యముల ననుభవించదగిన వాడవు. నీకు మహదైశ్వర్య సంపదల నొసంగుదును. వాటిని అందుకుని సుఖముల పొందుము. నీవు కోరిన లౌకిక భోగ భాగ్యముల

నెన్నియైననూ ఇత్తును" కోరు కొమ్మనెను. అందులకు నచికేతుడు, ధర్మరాజా! యెన్ని సంపదలైననూ, యెన్నిభోగములైననూ తమ సంపర్కము లేనిది సృష్టిలో నుండలేవుకదా? ఇవన్నియూ మృత్యువుతో మిశితమై తాత్కాలిక ఉపశమనమును గూర్చు సుఖములు నాకెందులకు? నేకోరినవరమును నాకు ప్రసాదించమని ప్రార్థించెను.

మహాభారతమున ఈప్రపంచమున అతి విచిత్రమైన విషయమేది అను ప్రశ్నకు ధర్మరాజు నిత్యము మనము మృత్యువుని జూతుము. కాని మనము చత్తుమని తలంచము, వూహించము. ఇంతకన్నా విచిత్రమేమికలదు అని జవాబు చెప్పెను. ఇటులనే యాజ్ఞవల్క్యుడు సన్యసింప వలయునని నిశ్చయించుకుని తనభార్యలయిన కాత్యాయని, మైత్రేయిని పిలిచి తన స్థిర చరాస్తి నంతయు ఇరువురుకూ పంచి పెట్ట ప్రయత్నించెను. కాని మహాప్రజ్ఞగల అతని మొదటి భార్య అయిన మైత్రేయి, భర్తను చూచి చిరునవ్వు చిందులు ద్రొక్క, నాథా! ఈ భౌతిక సిరిసంపదలు నన్ను మృత్యువు బారి నుండి తప్పించి నితు రాలుగ జేయగలవా? అట్లు చేయునని తమరు హామీ యిచ్చిన తప్పక నేనంగీకరింతును, శిరసావహింతును. అని ప్రశ్నించెను. అందులకు యాజ్ఞవల్క్యుడు, మైత్రేయా! లోకమున సిరిసంపదలే కదా ప్రధాన సుఖశాంతులను కలిగించును, ఇట్టివిత్తాదులను వలదనువారుందురా? అని జ బు చెప్ప, మైత్రేయి. నాథా! అట్లయిన ఈ విత్తాదులతో తమరు కూడా సుఖశాంతుల ననుభవించవచ్చుకదా? సన్యసించుటెందులకు? ఈ భ్రాంతులచే అబలలను మోసపుచ్చుట మంచిదికాదు, నీకు కాని విత్తాదులు మాకు మాత్రము యెట్లు శాంతి సుఖముల నందించును? ఇవి అనిత్యములు, క్షణభంగురములు, బంధ కారణములు, అజ్ఞాన పోషితములు, అశాంతి కీలకములు, అనాత్మకలుషితములు అని మైత్రేయి వున్న సత్యమును విన్నవించగనే యాజ్ఞవల్క్యుడు చేయునది లేక మైత్రేయి యొక్క సత్యవాక్కులకు శిరస్సు వంచెను. అంత మైత్రేయి పతికి నమస్కరించి నాథా! సర్వ రహస్యములను యెరిగిన మీరు మా అల్ప బుద్ధులను పరీక్షించ గోరి ఈవిధముగ ప్రశ్నించియుందురు, నాకే భోగములు వలదు. సిరిసంపదలు వలదు. నిత్యమగు పరమానంద పథము బొందగలుగు మార్గోపదేశము చేయుము అని నమస్కరించెను. యథార్థముగ వున్నది వక పరబ్రహ్మము," బ్రహ్మసత్యం, జగన్మిథ్యా జీవోబ్రహ్మైవనాపరః" అని అద్వైత శాస్త్రములు చాటు చుండగా ఈ స్వప్న దృశ్యముల వంటి ఈ భోగభాగ్యములు క్షణ భంగుర మైన పదవులు, ద్వేష, అసూయ, స్వార్థాది యెండమావులు నిజమని తలంచి, భ్రమించి, వాటికై పరుగిడెడివారు గురువు లెట్లగుదురు?వారిని జ్ఞానులన చెల్లునా? మిధ్యాపీఠములపై ప్రతిష్ఠలు ఆచరణ లేని ఉపదేశములు, అనుష్ఠానములో లేని ఆదేశాలు ఆదర్శవంతమెట్లగును? గురుత్వము యొక్క సత్యత్వమునకు సహజ స్థాయికాదుకదా? ఇట్టి వారు గురువులు కారు. సర్వేశ్వరుడొక్కడే జగద్గురువు అని తలంచుట సాధకులకు సరియైన మార్గము. ఇదియే సత్య సాయి వాహిని యొక్క ఆదర్శము.

# శ్రద్ధావాన్ లభతే జ్ఞానం

వేషభాషలందు గర్వించరాదు
తనకు తా మెచ్చుకొనరాదు
పరుల దూషించరాదు
ఇడియె జ్ఞానంబనంగ

ప్రాచీన కాలము నుండి భారతదేశములో యుగ యుగాలుగా పర్వదినములు విశిష్టమైన అంతరార్థము లతో కూడి ఆధ్యాత్మిక సత్యములను ప్రకటించు నవిగా ఉండుట విదితమే. కాని బాహ్య ఆచారములు ప్రవర్తనలు మనము అలవరచుకొనుటచేత వాటి అంత ర్భావములు, అంతరార్థములు, తత్వములు విస్మరించు చున్నాము. భారతదేశంలో పాటించగలిగిన వ్యక్తులకు ప్రతిదినము పర్వదినమే. మాస మాసము శివరాత్రి పదిహేను దినముల కొకసారి ఏకాదశి వ్రతము, బాగా విచారించిన ప్రతిదినము భారతీయులకు పర్వదినము గానే ఉండును. కాని అన్ని పర్వదినములకు ఈ నాటి దీపావళి పర్వదినమునకు వ్యత్యాసము అధికముగా కనిపించును. ఒక్క భారత దేశములోని అనేక ప్రాంతములలో దీనిని అనేక విధముల అనుసరించి ఆరాధిస్తున్నారు. కొన్ని ప్రాంతములందు శ్రీరామ చంద్రుడు అయోధ్యను వదలి, 14 సంవత్సరాలు కష్టములకు గురై, సీతను కోల్పోయి, కష్టములుపడి, అయోధ్య వాసులను అంధకార బంధురములో పడ ద్రోసి, రావణుని హతమార్చి, తదుపరి అయోధ్య పట్టణము చేరి, పురవాసుల హృదయములు పవిత్ర ముగా దీవించి, సీతామహాతల్లి అయోధ్యలో ప్రవేశించి ఆనంద దీపము వెలిగించిన దినముగా చేస్తున్నారు. మరికొన్ని ప్రాంతములందు కృష్ణావతారములో సత్య మును ఆధారముగా నరకుడు అను దుర్గుణములకు ఆలవాలమైన అసురుని వధించి, సాధుసత్పురుషులలో దివ్య గుణములను ప్రకాశింపచేసిన పర్వదినముగా చేస్తున్నారు. మరికొన్ని ప్రాంతములలో భగవంతు నకు ఇచ్చిన వాగ్దానమును అనుసరించి బలిచక్రవర్తి ఏ విధముగా వామనమూర్తికి సిద్ధాశ్రమమున అందిం చెనో మనస్సులో ఉంచుకొని పర్వము చేయుచున్నారు.

ఈ విధముగా అనేక ప్రాంతములలో అనేక కారణ ములు పురస్కరించుకొని, అత్యంత ఉత్సాహముగా, ఉత్సవములు జరుపుకుంటున్నారు. కాని ముఖ్యముగా నరక చతుర్దశి నాడు నరకాసురుడు అనగా నరకము నకు గొనిపోవు అసురత్వము అని గ్రహించాలి. ఈ నరకాసురుని ముఖ్య పట్టణము ప్రాగ్జ్యోతిషపురము. ప్రాక్ అనగా ముందు, జ్యోతి అనగా వెలుతురును, షా-అనగా మరచిపోవుట. అనగా ముందు వెలుతురును మరచిపోవు కేంద్రమే ఇతని రాజ్యము. అనగా 'ముందు జ్యోతి', 'ఆది జ్యోతి', ఆత్మ జ్యోతి'ని మర చిన ప్రదేశమే ప్రాగ్జ్యోతిషపురము. అనగా ఆత్మ జ్యోతిని మరచిన స్థానము ఈ నరకాసురుని ముఖ్య పట్టణము. అనగా ఆత్మ జ్యోతిని మరచిన ప్రతివ్యక్తి నరకాసురుడే. అంటే అజ్ఞాన, అంధకార, అహంకార, అభిమానములచే నిండిన మానవతత్వమే తన ఆత్మ జ్యోతిని మర్చిపోయింది. మానవునిలోని దుర్గుణములు

దురాచారములు, దుష్కృత్యములు. దురహంకారములు అను నరకాసురుడు తనలోని ఆత్మజ్యోతి అను పరంజ్యోతిని మరచిపోతున్నాడు. నరకాసురుని తల్లిభూదేవి. ఈ భూదేవి నిరంతరము భగవంతుని ప్రార్థించెను. ఏ తల్లి కూడను తన కుమారుని మరణము ఆశించదు. సహించదు. అట్టి దుఃఖమును భరించదు. కాని నరకాసురుని తల్లి భూదేవి భగవంతుని 'స్వామీ. ఏనాడు నా కుమారుడు అంతమొందే, ఈ భూమి అంతా జ్యోతిలో ప్రకాశించునో అట్టి నా కుమారుని మరణ దినము ప్రపంచమంతా ఆనంద దినముగా; బ్రహ్మ ముహూర్తములో ప్రజలులేచి, జ్యోతిని వెలిగించి, ఆనందోత్సాహములతో గడపుదురు గాక' అని ప్రార్థించెను. అందుచే నరక చతుర్దశి అని అభ్యంగన స్నానముచేసి, నూతన వస్త్రములు ధరించి. జ్యోతిని వెలిగించి పెద్దలు, పిల్లలు అందరు ఆనందముగా నుందురు దీని అంతరార్థము భూదేవిపై పుట్టిన ప్రజలంతా ఆమె బిడ్డలే. ఆ తల్లికి అయిష్టమైన కృత్యములాచరించిన. ఆ తల్లి కుమారుని మరణము ఆశించును. తల్లియై తన పుత్రుని మరణము ఆశించుటకు అతని దుర్గుణములే కారణము. ఈ నరకాసురునిలోని దుర్గుణములు – అహంకారము – అసూయ – క్రోధము, ఈ అసూయ. అహంకారము. క్రోధము పైశాచిక ప్రవృత్తులై నరకాసురుని హృదయములో ప్రళయ తాండవము చేసెను. ఇట్టి దుర్గుణములను దూరము చేయుటకు ప్రయత్నము. శ్రద్ధ అవసరము. 'శ్రద్ధావాన్ లభతేజ్ఞానం' ఈ జ్ఞానము లేకపోవుటచే ఈ దుర్గుణములకు ఆలవాలమై ఉండుట.మానవునకు శ్రద్ధకుమించిన పుణ్యము, సమానమైన సుఖము మరి లేదు. శ్రద్ధవల్ల అప్రాప్తమైన వస్తువులు మనకు ప్రాప్తించును. అశ్రద్ధ వల్ల లభ్యము కావలసిన వస్తువులు అలభ్యమగును. ఏకలవ్యుని గాథ భారతీయులకు తెలిసిన విషయమే ఏకలవ్యుడు ద్రోణాచార్యుని విలువిద్య కొరకు ప్రార్థించగా, ఒక్క క్షత్రియునకు మాత్రము నేర్పుదును, అన్యులకు లేదని ద్రోణాచార్యుడు చెప్పెను. అప్పుడు చేయునదిలేక ఏకలవ్యుడు అతిశ్రద్ధతో, దీక్షతో మట్టితో ద్రోణాచార్యుని విగ్రహము సృష్టించి, అస్త్ర శస్త్ర విద్యను నేర్చుకొనెను. అష్టవిద్యలతో కట్టకడపటిదైన శబ్దవేదికూడ సాధించెను. అనగా శబ్దమును బట్టియే అస్త్రములను ప్రయోగించు విద్య. దీనినిచూచి ద్రోణాచార్యుడు మహా ఆశ్చర్యపడెను. అర్జునుని శక్తి సామర్థ్యముల కంటే ఏకలవ్యుని శక్తి సామర్థ్యములు ఎక్కువగా కనిపించెను. ఈ శక్తి సామర్థ్యములకు కారణము శ్రద్ధే. శ్రద్ధకలిగిన వానికి అణుమాత్రము నిప్పుతో గొప్ప అగ్గిగా చేయగల అవకాశముండును. శ్రద్ధలేని వానికి తట్టెడు నిప్పుల నిచ్చినా, అన్నిటిని ఆర్పివేయును. తన ఇంటిలో సర్వ పదార్థము లున్నను శ్రద్ధలేనివాడు ఆకలిని తీర్చుకొనలేడు. శ్రద్ధ కలిగినవాడైన పదిఇండ్లు యాచించి అన్నము సంపాదించి, ఆకలిబాధ తీర్చుకొనును. దీనికి మూల కారణము శ్రద్ధ. అదృష్టముకూడ శ్రద్ధ అను ద్వారము నుండియే ప్రవేశించును. సారవంతమైన భూమి, సకాల వర్షములుండినను, శ్రద్ధగా విత్తనములు నాటకుండిన ఫలితములేదు. కారణము శ్రద్ధలేకపోవుటయే. ఇంతచిన్న విషయములకు శ్రద్ధ ఇంత అవసరమైన ఆధ్యాత్మిక మార్గములో ఎంత అవసరమో ఆలోచించాలి. చెట్టుకొమ్మలలో ప్రతి కొమ్మలో అగ్ని అంతర్భూతముగా ఉండును. కాని కొమ్మకు కొమ్మకు రాపిడి కలిగినప్పుడే అగ్నిపుట్టును. పెరుగులోనే వెన్న ఉన్నను, చిలికినప్పుడే మనకు వెన్న లభించును. వెన్నలోనే నెయ్యి ఉన్నప్పటికీ మనం కాచినప్పుడే నెయ్యివచ్చును. నువ్వులయందే నూనె ఉండును. సరియైన ప్రయత్నము చేసినప్పుడే అది మనకుచిక్కును. ఇవన్ని శ్రద్ధ లేనియెడల రావు. కనుక మానవుని యందే దివ్యమైన ఆత్మతత్వము ఇమిడియుండును.

ప్రతివ్యక్తి మోక్షార్హుడే. కాని ఆ అధికారమునకు తగిన సాధన జరిపినప్పుడే దానికి అర్హత వచ్చును. 'సాధన మున పనులు సమకూరు ధరలోన'. సాధనాశక్తితో మానవునిలోని దివ్యమైన ఆత్మశక్తిని అభివృద్ధి చేయు ప్రయత్నము చేయాలి. ఆ ఆత్మశక్తి మన అంత రాంతరములలో ఉండు దివ్యభావమే, అది మనకు కని పించుట కష్టము. ప్రతి మానవుడు విలువైన నగలు, నోట్లు, డైమండ్సు భద్రమైన పెట్టెలోపెట్టి జాగ్రత్త చేస్తాడు. విలువలేని బుట్ట, చట్టి, పెట్టె బయట పారే స్తాడు. సముద్రము కూడా విలువైన ముత్యములను తన గర్భములో దాచుకొని, విలువలేని నత్తగుల్లలను బైటకు విసరివేయును. అదే విధముగ మానవుని లోని అంతరాంతరములలో'ఆత్మ'అనునది చాలా విలువైనది ఉన్నది. కాని విలువలేని రూపనామములు బయటకు కనిపించును. విలువలేని రూపనామములకే ప్రాధాన్యత. విలువగల ఆత్మ తత్వమునకు విలువలేదు. అదే విధ ముగా రూపనామములకు ప్రాధాన్యతనిచ్చి, అదే సత్యమని భావించువాడు నరకాసురుడు రూపనామ ములు సత్యముకావు. ఏనాటికైనను భగవంతుని కటా క్షమునను గురికాక తప్పదు. అట్టి అనుగ్రహమునకు పాత్రులగుటకు మనలోని దురహంకారము, క్రోధము, అసూయ మొదలగు దుర్గుణములను దూరము చేసికొ నుటకు ప్రయత్నము చేయాలి.

జీవితములో ఎన్నో దీపావళులు గడచిపోవును కాని మనలోని అంధకారము పోవుటలేదు. బయట వెలుగుని చూచి ఆనందిస్తున్నాము కాని లోన చీకటిని చూచి విచారించుటలేదు. అందుకే గోపికలు కూడా 'మబ్బు గమ్మిననాడు మానసమ్మున నీదు తేజము నిలుపరాదా'–నా మానసిక, హృదయ వీధి చాలా చీకటిగా ఉంది. అందుచే నీ నామమనే జ్యోతితో వెలుతురు ఇయ్యి' అని ప్రార్థించేరు. ఈ దీపావళికి ఇంకో అంతరార్థము. మనము అనేక జ్యోతులు పెట్టు దుము కాని అన్ని జ్యోతుల దగ్గరకుపోయి నిప్పు ముట్టించము. ఒక్క జ్యోతిని వెలిగించి, అన్ని జ్యోతులను దానితో వెలిగింతుము. అందుచే అంటింప బడిన అన్ని జ్యోతులు జీవన జ్యోతులు. అంటించిన ఒక్క జ్యోతి పరంజ్యోతి. అందుచే పరంజ్యోతి అను వెలుతురులో అన్ని జ్యోతులు వెలుగుచున్నవి. కాని ఆ అంటించిన పరంజ్యోతిని, ఆది జ్యోతిని మనం మరచి పోతున్నాము. అందుచే అందరు నరకాసురులే. ఏనాడు మనం ఆది జ్యోతిని లక్ష్యంలో ఉంచుకొందు మో, ఆనాడు ఆ కృష్ణుని అనుగ్రహమునకు పాత్రు లమగుదుము. అందుచే ఏ నాడు మనలోని అజ్ఞాన అంధకారమును పారద్రోలుదుమో–'తమసోమా జ్యోతి ర్గమయ'–ఆనాడే దీపావళి.

సీతారాముల చింతలో, వియోగంలో అయోధ్య దుఃఖంలో, అంధకారలోనింది, సీతారాముల ఆగమ నంతో జ్యోతులు వెలిగించి ఆనందించి, ఆడిపాడిన దినముగా కొన్ని ప్రాంతములవారు అనుసరిస్తున్నారు. రామ అనుపదమునకు ఆత్మను రమింప చేయువాడు– 'రమయేతిరామ' అని ఒక అంతరార్థముంది. ఆత్మా రామ అంటాము కాని ఆత్మ కృష్ణ ఆత్మశివ అనము కనుకనే ఈ ఆత్మ అనురామ తత్వమును మరచి పోవుటచే ఈ హృదయము అను అయోధ్య అంధ కారములో మునిగి ఉంటున్నది. ఈ ఆత్మకు ఒక నీడ ఉంది. అదే పరమ శాంతమైన. శీతలమైన, పవిత్రమైన, నిర్మలమైన, నిరాకారమైన నిరుపమమైన సీత. ఈ పవిత్ర శీతలమైన సీతను మరచిపోవుటచే అసూయా తత్వములు చేరుటచే మన హృదయములు మలినమై పోవుచున్నవి. ఏనాడు ఆత్మను లక్ష్యము నందు తలంచుదుమో, ఆనాడు అయోధ్యా వాసులకు కలిగిన ఆనందము, సౌభాగ్యము కలుగును. కనుక మన హృదయములు అను అయోధ్యలో తిరిగి ఆత్మ అనురాముని ప్రవేశింపచేసి, సీత అనుశీతలమైన ప్రాగ్జ్యోతిని వెలిగింప చేయవలెను.

అదే విధముగా శ్రీకృష్ణుడు. సత్యభామా సమేతుడై నరకాసురుని వధించుటకు అర్థము. కృషితేతి కృష్ణ హృదయ భూమిని సాగుచేయువాడు కృష్ణుడు. 'కర్ష తేతి కృష్ణః'-ఆకర్షించువాడు కృష్ణుడు అని ఇంకొక అర్థము. అక్కడ రమించువాడు రాముడు ఇక్కడ ఆకర్షించువాడు కృష్ణుడు. అక్కడ రమించురాముడు. శాంతము అను సీతా సహితుడు. ఇక్కడ ఆకర్షించు కృష్ణుడు సత్యా సమేతుడు. కనుక దుర్మార్గమైన దుర్గుణములను వధించుటకు సత్యముతో వెళ్ళేడు కృష్ణుడు. సత్య సహితమైన కృష్ణుడు, శాంత సహితుడైన రాముడు-ఈ రెంటిని ప్రేమసహితమైన భావములో అనుభవించాలి. ఇట్టి పవిత్ర భావములు అందించు పర్వదినములు భారతదేశములో ఉన్నవి. కాని వాటి అంతరార్థములు మరచి, దీపములు ముట్టించి పటాసులు పేల్చుట అను ఆచారమును దీపావళినాడు అనుసరిస్తున్నాము. కాని పవిత్రతలేదు.

మరి కొన్ని ప్రాంతములలో ఈ దుర్గుణములను హతమార్చుటకు లక్ష్మిపూజగా చేస్తున్నారు. లక్ష్మి అనగా ధనలక్ష్మి, గజలక్ష్మి, మహాలక్ష్మి కాదు. మన హృదయలక్ష్మి. పవిత్రమైన గుణముల లక్ష్మి. మోక్ష లక్ష్మి, ఈ మోక్షలక్ష్మిని ఆరాధించు నిమిత్తము మొదటి దినమున దుర్గుణములను దూరముచేసి. రెండవ దినమున ఆ పవిత్రమైన లక్ష్మి కొరకు ప్రార్థన చేయాలి. ఈ మోక్ష లక్ష్మి మానవునికి ముక్తి శాంతము అనుభవించు నిమిత్తము పవిత్ర మార్గము అవలంబించాలి. ఈ విధమైన పవిత్రమైన అంతరార్థములు పవిత్ర భారతదేశములో పర్వదినములకు కలవు. నేటినుంచి మన హృదములలో ఆవేశించిన దుర్గుణములను, దుష్ట లక్షణములను పారద్రోలి పవిత్రమైన, నిర్మలమైన, నిస్వార్థమైన ప్రేమమయమైన భావములుగల ఆత్మతత్వము కొరకు ప్రయత్నించాలని ఆశిస్తున్నాము కనుక ఏ సాధన చేసినా మన హృదయములను పవిత్రముగా చేయు క్రియలుగా భావించాలి. దివమునకు నాలుగు పర్యాయములు స్నానము చేసి శరీరమును శుభ్రపరచుట కంటె ఒక్క పర్యాయము హృదమును శుద్ధము చేసిన చాలును. ఈ విధముగా చిత్తశుద్ధి కొరకు ఈ పర్వదినములని భావించాలి కాని పాయస పరమాన్నములతో పొట్టనింపు కొనుటకు కాదు. ఈనాడు దుర్గుణములను దూరము చేసుకొనబూన వలసిన దినము. అప్పుడే మనకీ ఆత్మానందము నిచ్చు సద్గుణములు మనలో చేరును. ఈ అన్నిటికీ శ్రద్ధ అవసరం. దీనిని పురస్కరించుకొనియే "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"అని అనేక పర్యాయములు గీతాచార్యుడు నొక్కి వక్కాణించెను. శ్రద్ధ లేనియడల ప్రపంచంలో ఏ ఒక్క చిన్న కార్యము కూడా సాధించలేరు. ఆధ్యాత్మిక మార్గములో ఈ శ్రద్ధను మరికొంత అభివృద్ధి చేసుకుని ఆనందాన్ని పొందుతారని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

బృందావన్

శ్రీవారి దివ్య సందేశం

దీపావళి (1978)

# ఆత్మ తత్త్వము

పరమాత్ముడు నిర్మలమైన ఆకాశమువంటివాడు. పరమాత్ముడు సూర్య చంద్ర నక్షత్రములనే నేత్రములుగా ధరించినటువంటివాడు. భగవంతుడు సర్వత్రా వ్యాపించినటువంటి వాయువీచికలతో కూడి నటువంటి వాడు. ఇట్టి విశ్వ స్వరూపమనే సత్యమును గుర్తించుటకు ఒక తత్త్వము అవసరము. తత్త్వమనగా లోకమున అనేకమంది అనేక రకములైన అర్థములను తెలుపుచు నానార్థములలో ఉన్నటువంటి యథార్థమును మరుగు పరచి అనర్థములనే స్వీకరించుచూ పోవుట ఈనాటియొక్క పరిస్థితి.

తత్త్వమనగా ఆత్మ విచారమును తెలుసుకొనగోరి, ఏకాంత పరిణామమును అభివృద్ధి పరిచి ఏకాంత ప్రకాశముయొక్క ముఖవైఖరియే తత్త్వమన్న సత్యమును యీనాడు మనము గుర్తించవలెను. మానవ ఆత్మయొక్క స్వభావములు, గుణములు దైవము ఆత్మయొక్క స్వభావ గుణములను స్ఫురింపచేసి వివరించు నటువంటి తత్త్వమే ఈ తత్త్వమునకు సరియైన అర్థము. నీతి సూత్రములయొక్క శాస్త్రమే సత్యము. ప్రత్యక్ష ప్రమాణ మైనటువంటి విద్యయే సత్యము. తత్త్వముయొక్క గమ్యమును, తత్త్వము యొక్క స్వరూపమును, తత్త్వము యొక్క నిర్మలత్వమును నిరూపించుటకు ఎట్టివారికి సాధ్యముకాదు. మతము యొక్క అభిలాషయే సత్యము. జనరంజకము చేసి ఆ మార్గమును తాను అనుభవింప చేసినటువంటి పరమ పవిత్రమైన దివ్యత్వమే తత్త్వము. సత్యాన్వేషణయొక్క సరియైన మార్గమే తత్త్వము. త్రికాలాబాధ్యమైనటువంటి సత్యస్వరూపమే తత్త్వము. జ్ఞానము యొక్క స్వరూపమైన ప్రేమయే తత్త్వము. ఈ జ్ఞాన ధనముయొక్క విలువ ఇట్టిది, అట్టిది అని చెప్పుటకు ఎట్టి వారికి కూడనూ వీలుకానట్టిది. ఇలాంటి పవిత్రమైన తత్త్వమును మనము ఈనాడు అర్థము చేసికొనుటకు తగిన ప్రయత్నము చేయుట లేదు.

దీనినే గ్రీకు భాషలో Philosophy అన్నారు. సత్యముపైన ఉన్నటువంటి మోజునే, ఇష్టమునే, ప్రేమనే, ఆనందమునే, అభీష్టమునే Philosophy అని చెబుతూ వచ్చినారు. ఈ Philosophy ఈనాడు మన జీవితంలో Full loss, అంత జీ వి త ము నే మనము దుర్వినియోగ పరచుకొనుచున్నాము. నిజముగా ఈ తత్త్వజ్ఞానమును ఏదో తెలిసికొని నటువంటి అనేకమంది పండితులు, మహర్షియులు, సత్యమును మరుగుపరిచి, వారికి తోచిన విషయములను లోకమునకు వ్యాప్తికావించే టటువంటి తత్త్వమును నాడు కూడానూ వారు కొంత సంకుచిత భావమును అనుసరించినారు కానీ భారతీయులయొక్క తత్త్వమునకు, పాశ్చాత్యులయొక్క తత్త్వమునకు చాలా భిన్న భేదములు కలవు పాశ్చాత్యులయొక్క తత్త్వము భావములతో కూడినట్టిది. ప్రాచ్యుల యొక్క తత్త్వము సత్యముతో కూడినటు వంటిది. పాశ్చాత్యుల వేదాంతము ఏ విషయములో అంత్యమగునో, అక్కడనుండి హిందూ వేదాంతము ప్రారంభమగును. పాశ్చాత్యులయొక్క వేదాంతము

భౌతిక మైనటువంటిది. భారతీయులయొక్క వేదాంతము అంతర్ముఖమైనటువంటిది. పాశ్చాత్యుల యొక్కతత్త్వము ప్రవృత్తికి సంబంధించినటువంటిది· భారతీయులయొక్క తత్త్వము నివృత్తికి చెందినటువంటిది. అలలు చూచుచూ ఉండినంతవరకు జలము మాత్రమే మనకు కనిపించును. కానీ అలలనులెక్క చేయక సముద్ర గర్భమునందు మునిగి, పవిత్రమైన విలువైన ముత్యములను తెచ్చుకొనే ప్రయత్నమే భారతీయుల వేదాంతము.

ఇట్టి దివ్యత్వమును వరించి, తరించి, తమయొక్క జీవితమును సార్థకము కావించుకొనే నిమిత్తమై, యీ పవిత్రమైన మానవత్వము ప్రాప్తించినది. మానవ జన్మము ఉత్కృష్టమైనటువంటిదని, వేదశాస్త్ర పురాణములు నాటి నుంచి, నేటివరకు కూడాను ఘోషించు చున్నవి. "జంతూనాం నరజన్మ దుర్లభం" అని, యీ మానవ జన్మము చాలా ఉత్కృష్టమైనటు వంటిదని పదే పదే చెప్పటము మనము వింటున్నాము. ఎన్ని విన్నప్పటికినీ, ఎన్ని గ్రంథములు మనము పఠించినప్పటికినీ, మనస్థాయి నికృష్టమైన స్థాయినే పొందుతున్నది. కానీ, ఉత్కృష్టమైన స్థాయిని అందుకొనుటలేదు. మనయొక్క జీవితమంతయు కూడను గ్రంథ పరిచయముద్వారా, వాక్శుద్ధి ద్వారా కేవలము నిరర్థకము కావించుకొను చున్నామే కనీ, దానిని సార్థకము కావించుకునే నిమిత్తము, అంతర్ముఖమునకు మరల్చుకొనుటలేదు. మానవునియొక్క ఉత్కృష్టత దేనియందు మనము ప్రకటిస్తున్నాము. దేనియందు మనము అనుభవించుచున్నాము? ఈప్రశ్నలకు కూడను మననుండి ఎట్టిజవాబు రావటములేదు కారణమేమిటి? అనుభూతిలో లేనటువంటి పదములు,ఆచరణలో లేనటువంటి పఠనములు, అనుష్ఠానములో లేనటువంటిప్రచారములు అన్నియు చేరి,' కాలమునే కాక మానవ జీవితమును సమాజమును కొంతవరకు మోసగించుటకు దోహదము చేయుచున్నాయి.

లోకములో మన కన్నులు తెరచి విచారించినప్పుడు మన కంటి ఎదుట అనేక ప్రాణములు, దేహమును వదలిపోవుట చూచుచున్నాము. మన కన్నుల ఎదుటనే, నూతన శరీరములు జన్మను ధరించుచున్నవి. కేవలము మానవత్వము నందే కాక పశు పక్షి మృగములయందు కూడనూ, అనేక రకములైన చర్యలను. పరిస్థితులను మనము కళ్ళారా చూచుచున్నాము. దాహము ఆకలి గొన్నపుడల్లా. పశుపక్ష్యాదులు ఏదో శ్రమపడి ఒక ప్రదేశమునకు వెళ్ళి దాహమును ఆకలిని తీర్చుకోవటము జరుగుచున్నది. అదే విధముగ మానవుడు కూడను, ఆకలి దప్పులు వేసినప్పుడు కొన్ని శ్రమలనోర్చి. అనేక రకములైన ఇక్కట్లకు గురియై తన పొట్టను నింపుకొని, తన దాహమును తీర్చుకొని జీవించు చున్నాడు. కానీ పశు పక్షి మృగములు దాహము వేసినపుడు ఏదో ఇంత గంజియో లేక మలినమైన నీరో, లేక ఇంత పరిశుద్ధమైన జలమునో తాము గ్రోలి చెట్లపైన నివసించు చున్నవి. కానీ పశు పక్షి మృగముల కంటె అమితమైన తెలివి గలవాడు కనుక మానవుడు తాను వట్టి జలమునే కాక కాఫీ, టీ, బ్రాందీ, విస్కీ, బీరు, యింకా, యింకా ఎన్నో గ్రోలుచున్నాడు. పక్షులన్నియు కూడను చెట్లపైన జీవించును. మృగములన్నియు కూడను పొదలయందు, కడ్డి యందు సంచరించుచూ కాలమును ఏదో ఒకరీతిగా గడుపుచున్నవి. మానవుడు కూడను చక్కని భవనములను నిర్మించుకొని క్రింద పడుకొనుటకు ఇష్టములేక, చక్కని ఎత్తైన మంచములు నిర్మించుకొని, దానిపైన డన్‌లప్ బెడ్, డన్‌లప్ పిల్లోస్ వేసుకొని ఏర్ కండిషన్‌లో నిద్రించుచూ వచ్చుచున్నాడు. పశు పక్షి మృగముల యొక్క నిద్రకు కానీ, సంచారమునకు కానీ, మానవుని యొక్క నిద్రకు ఆహారమునకు, సంచారమునకు కానీ, యీ రకమైన భేదభావములు గుర్తించు

చున్నామే తప్ప, మిగిలి నటువంటి భావములు కానీ స్థితులు గానీ, రెండింటికినీ సమతత్త్వమే అను సత్య మును మనము గుర్తించుటలేదు. పక్షులు కూడను ఆకలి, దప్పి, కోపము, ప్రేమ, సంతానము, భార్య కుటుంబము దుఃఖములతో, విచారములతో, సంతోష ములతో, సుఖములతో అవస్థలు అనుభవించు చున్నవి. మానవుడు కూడను అట్టి పరిస్థితులనే, తాను కూడనూ అనుభవించు చున్నాడు. ఇంక దేనిలో మాన వుడు ఉత్కృష్టుడు అనే టటువంటి దానిని మనము ఈనాడు విచారించవలెను.

నిజముగా యోచించిన, యీనాడు మానవులకంటే, పశు పక్షి మృగాదులు కూడనూ ఎంతో మెరుగుగా కనిపించు చున్నవి, ఉత్తమ మైనవిగా నిరూపించు చున్నవి. పశు పక్షి మృగములకు కష్టములు నష్ట ములు, దుఃఖములు వచ్చినప్పుడు తమను తాము ఆదుకొని, ఏదో క్షేమమైన ప్రదేశమునకు, రక్షిత మైన ప్రదేశమునకు, తాము ప్రయాణము సలపుచూ ఎంతో శ్రమలనోర్చి, తమ రక్షణను సలుపు కుంటూ వచ్చుచున్నవి. మానవుడు కూడను తనకు కష్టములు దుఃఖములు సంప్రాప్తమైనపుడు నాలుగు అబద్ధములు ఆరుదాడీలు, ఎనిమిది తంటాలూ, యింకా అనేక రకములైన ఉపయోగమైన, కొన్ని లంచములు కొన్ని Recommendations ద్వారా తాను తప్పించు ప్రయత్నము చేయుచున్నాడు.

పులికానీ, సింహము కానీ, ఏనాడు తపస్సు చేసి నట్లు ఏ గ్రంథములోను చదవలేదు. ఏనుగుగానీ, ఎద్దుగానీ, బ్రహ్మచర్యమును సాగించినట్లు మనము ఎక్కడ కూడనూ చదవలేదు. చిరుత, తోడేలు. ఇవి అన్నియుకూడను సాత్విక ఆహారము భుజించి నట్లు ఏ గ్రంథములోను చదవలేదు. కానీ తపస్సులు సాత్వికమైన ఆహారము, పవిత్రమైన బ్రహ్మచర్యము ఇవి అన్నియు కూడను ఒక్క మానవునికి మాత్రమే నియమించుటలో ఉన్న అంతరార్థము ఏమిటో మనము గుర్తించవలెను. యీనాడు మనము నిత్యానుభవము లోపల ప్రతి గ్రామము నందును, ప్రతి పట్టణము నందు కూడను, నిత్యము చూచుచుంటాము. కోతులు ఒక గుంపుతో, మరొక గుంపు వచ్చి చేరిన, యీ గుంపు అంతయు ఏకమై రెండవ గుంపుపైన విజ యము సాధించుటకు అనేక ప్రయత్నములు సలు పుచూ ఉండును. కుక్కల యందు కూడనూ ఒక్క గుంపుపైన మరొక క్రొత్తగుంపు వచ్చి చేరినపుడు, యీ పాత గుంపు అయిన కుక్కలు క్రొత్త గుంపు పైన విజయమును సాధించుటకు ఎన్ని రకములైన ప్రయత్నములైనను సలుపును. కుక్కలు, కోతుల యందు ఐకమత్యము, సమరసము కలిగి ఉంటు న్నవి కానీ మానవునియందు అది కనిపించుట లేదు. తాను, తనవారు, తన బిడ్డలు అను సంకుచిత మైన, స్వల్పమైన భావము తనలో పెంచుకొని పరుల యొక్క కష్టము, అవస్థలు, దుఃఖములు, ఏరీతిగా ఉన్నవి అను సత్యమును కన్నుతెరచి చూడనటువంటి మానవులకు ఆధ్యాత్మిక తత్త్వము ఎట్లు అర్థమగును? నిజముగా ఆధ్యాత్మిక తత్త్వమనగా విశాలమైన భావ ముతో సంకుచితమును, నిర్మూలముచేసి సమరస మైన తత్త్వమును వ్యాప్తి కావించు పవిత్ర తత్త్వమే ఈ తత్త్వము. కనుకనే మానవునికి తెలివికంటే వివేకము అనునది అధికముగా ఉండుటచే, పశుపక్ష్యాది మృగములకు, మానవునికి ఉన్న వ్యత్యా సము యీనాడు మనము గుర్తించుటకు తగిన యత్నము చేయుట అత్యవసరము.

పక్షులకు, పశువులకు కూడను ఒక జ్ఞానము ఉన్నది. కానీ విజ్ఞానములేదు. ఈ విజ్ఞానమును మనము ఏనాడు అనుభవ జ్ఞానముగా రూపొందించు

కొందుమో ఆనాడే మానవులు అని చెప్పుటకు ఒక విశేషమైన అధికారముండును. అంతవరకు మనము ఆకార మానవులమే తప్ప మానవత్వముతో కూడిన నరులము కామనే టటువంటి దానిని తప్పక అంగీకరించాలి. ఎట్టి మంచి జాతి విత్తనమైననూ చవిటిభూమిలో చల్లినపుడు, అది మొక్కలుగా రూపొందుతుందా? ఈనాటి మన బుద్ధులకు, కష్టములకు, సుఖములకు, దుఃఖములకు ఏది కారణము? మన చర్యలే. మన భావములే. మన ప్రయత్నమే, మన గుణములే దీనికి మూలకారణముగా రూపొందుతుంది. భూమిలో ఉల్లి నాటిన, ఉల్లిమొక్కలు మొలుచును మల్లె నాటిన మల్లె మొక్కలు మొలుచును. ఎట్టి పంటయో, అట్టి పదార్థము. ఎట్టి వంటయో అట్టిరుచి. పిండికి తగిన రొట్టె, కనుక ఈనాడు మన స్థితులకు మన భావములే విత్తనములుగా రూపొందుచూ వచ్చుచున్నవి. పరులు దీనికి కారకులు కాదనే సత్యమును చక్కగా గుర్తించవలెను. పరులను నిందించి దూషించి, హేళన చేసి, పరులను దూరము చేసికొని ఏదో ఒక తృప్తిని పొందుచున్నాము అనుకొనుట వెర్రితనము. ఏది నీవు ఇత్తువో అదే నీవు అందుకొందువు. కనుక నీవు యీనాడు ఎట్టివి చేతువో, అట్టి వానినే భవిష్యత్తులో అనుభవించుటకు అవకాశమున్నది. కనుక మనము వివేక వంతులమై "జంతూనాం నరజన్మ దుర్లభం" అను పదమును సార్థకము కావించుకొని పశు పక్ష్యాదులకంటే ఒక విధమైన ఉత్కృష్టమైనస్థాయిని మనము అందుకొనుటకై తగిన కృషి సలుపుటలో మొట్టమొదట మనము వివేకమును పోషించుకోవలెను.

ఈ వివేకమును కొంతవరకు అనుభవమైనట్టి వివేకములుగా రూపొందింప చేసుకొనుటకు, శారీరికమైన సాధనలు జరుపవలెను. నిన్నటి దినమున మనము కనుగొన్నాము. మల విక్షేప ఆవరణలను మూడు కూడనూ తొలగుటకై మనము కర్మ, భక్తి, జ్ఞానము యొక్క మార్గమును అవలంబించుటకు ప్రయత్నించవలెను. బాల్యము కౌమారము లేక ఏ విధముగ యవ్వనము రాదో, పిందె కాయ లేక ఏ విధముగ ఫలముకాదో, అదే విధముగ కర్మ భక్తి, అను రెండూ ఆచరణయందు పెట్టినకానీ జ్ఞానమును పొందుటకు వీలుకాదు అనేకమంది కర్మ మార్గమును భక్తి మార్గమును అవలంబించు నట్టివారిని చూచి హాస్యముచేయు పెద్దలు కూడను కలరు. భారతదేశమునందు. విగ్రహారాధన చేయువారిని చూచి కొంతవరకును హాస్యాస్పదముగ వారిని హేళన చేస్తూ ఇది అంతయు కూడాను ఒక ప్రథమ స్థాయిలో ఉన్నటువంటి వారిగా భావించుటకద్దు. కానీ ఇది సరియైనది కాదు. నిజముగ మనము ఆరాధన సలిపి, ఉపాసన సలిపి. తద్వారా మనయందున్న మర్రిపిందెను వృక్షముగా ఏరీతిగా మనము అభివృద్ధి గావించుకొందుమో, అదే విధముగ మనయందున్న దివ్యత్వమును తత్వమును విశాలమైన ప్రేమగా భావించుకొని, తద్వారా విశ్వస్వరూపమైన తత్వమును అనుభవించు ప్రయత్నము చేయుటయే సాక్షాత్కారము యొక్క అర్థము.

నిన్నటి దినము మనము తెలిసికొనినాము. సాక్షాత్కారము అనగా నూతనమైన స్థితిని, స్థాయిని పదార్థమును సాధించుకొనుట అనుకొనుచున్నాము. ఇది చాలా పొరపాటు. మనలో నిరంతరము ఉన్న, మనచే మరువబడిన తత్వమును మనము గుర్తించి, దానిని సందర్శించుటకు తగిన యత్నము చేయుటయే సాక్షాత్కారము. తత్త్వజ్ఞానమనగా తత్, త్వమ్, తత్ అనగా దైవమును, త్వమ్ అనగా జీవమని జీవేశ్వరుని గుర్తింప చేసే టటువంటిదే తత్త్వజ్ఞానమని చెప్పుచున్నారు. అనగా రూపమునకు చాటునున్నటువంటి స్వరూపమును, సత్యమును, వాస్తవమునకు సరియైన చిహ్నమే ఈ తత్వమని యోచించుచున్నారు. అనగా

రూపమునకు చాటు నున్నటువంటి వాస్తవమునకు ఇది కేవలము సంజ్ఞాయిషీ రూపొందుతూ వచ్చుచున్నది తత్త్వము రూపముతో ఉండినటువంటిది జీవతత్త్వము పంచేంద్రియములతో కూడి నటువంటిది జీవతత్త్వము. పంచ ప్రాణములు' పంచకోశములతో కూడినటువంటిది జీవతత్త్వము. పంచప్రాణ, పంచేంద్రియ, పంచ కోశ, పంచదృక్కులకు అతీత మైనటువంటిదే దైవత్వము.

ఈ పంచ కోశములందు, అన్నకోశమని, ప్రాణమయకోశము, మనోమయ కోశమని, విజ్ఞానమయ కోశమని ఆనందమయ కోశమని పిలుస్తూవచ్చేరు. ఇందులో అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయ కోశము, ఈ మూడునూ దృశ్యకర్పిత మైనటువంటివి. విజ్ఞానమయ, ఆనందమయ కోశము అనునవి నివృత్తికి చెందినటువంటిది. అగమ్యగోచర మైనటువంటివి. కనుక అన్నమయ, ప్రాణమయ, మనోమయ ఈ మూడును చేరినప్పుడే దానికి "త్వం" అని పేరు. విజ్ఞానమయ, ఆనందమయ అను పదములకు "తత్" అని పిలవబడవచ్చును. అయితే మానవుడు ఎవరు? ఈ విజ్ఞానమయ, ఆనందమయములు తత్ రెండునూ, అన్నమయ, ప్రాణమయ మనోమయములు "త్వం" మూడును చేరి "అసి" దానినే "తత్ త్వమ్ అసి" అన్నారు. ఈ రెండింటియొక్క ఐకమత్యమునే మానవత్వముగా భావించుకొనుటలో యిందులో ఉన్నటువంటి దివ్యత్వము ఎంత పవిత్ర మైనటువంటిదని ప్రతి వ్యక్తికూడ గుర్తించవలెను.

కనుక దైవము అనగా ప్రత్యేకించినటువంటి ఒక ప్రదేశమునందుకానీ, ప్రత్యేకించిన ఒక స్థానమునందు కానీ లేదను సత్యమును ఈనాడు మనము గుర్తించాలి.

"దైవ మనగ వేరు దేశమందున లేడు
దైవమనగ కలడు దేహమందే" అను సత్యమును ఈనాడు మనము తెలుసుకోవలెను అంతేకాక,

"పాపమనగ వేరు పరదేశమున లేదు
తాను చేయు పనుల తగిలియుండు."

తన కర్మల యందే సర్వ పాపములు కూడనూ లీనమై ఉంటున్నవి. పవిత్రముకాని, అపవిత్రముకాని ఘనమైనటువంటిదికానీ, హీనమైనటువంటిదికానీ, మంచిదికానీ, చెడ్డదికానీ, ప్రవృత్తికానీ, నివృత్తికానీ, ప్రతి మానవునియందును సమ్మిళితమైనటువంటి త్రిమూర్తి స్వరూపమును ధరించియున్నది.

"భాస్కర బింబే దీప్తం దైవం" అని నిన్న చెప్పేను. "త్రిగుణ భవనౌ వ్యాప్తం దైవం"— ఈ యావత్తు ప్రపంచ మంతయు, త్రిగుణ స్వరూప మైనటువంటిదిగ రూపొందుతూ వచ్చినది. త్రిగుణాత్మకమైనటువంటిదే ఈ విశ్వము. త్రిగుణాత్మకమైనటువంటి విశ్వమును తెలిసికొను నిమిత్తమై వేదము మనకు అనేక రకములైన మార్గములను, అనేక విధములైన సోపానములను మనకు అందించుతూ ఉన్నది. వేదములు త్రిగుణములకు ఈవల నున్నటువంటి విషయములను మాత్రమే తెలుపుచున్నది గానీ, త్రిగుణములకు అవలనున్న విషయములను తెలుపుటకు వేదమునకు కూడను సాధ్యముకాదు. అందువలననే వేదమునందు "యతో వాచనివర్తంతే అప్రాప్య మనసాసః" వాక్కులకుకానీ, మనస్సునకు కానీ, ఆ దైవత్వమును తెలుసుకొనుటకుకానీ, వర్ణించుటకుకానీ, సాధ్యము కాదని వేదమే నిర్ణయించినది, మరి ఏరీతిగా దైవమును చూడవలెను? వేదము వలననే సాధ్యము కాదనుకుంటే ఇంక దైవమును చూచుటకు మార్గము ఏమిటా అని అనేకమంది విచారించి

నపుడు "న కర్మణా న ప్రభయా, ధనేన త్యాగే నైకే అమృతత్వం మానసుః" ఈ త్యాగము వలననే దైవత్వమును అనుభవించుటకు వీలవుతుంది. ఈ త్రిగుణముల చేత మనము బంధితులమై విషయ వాస నలలో మునిగి, పంచేంద్రియములయొక్క స్వాధీన ములో మనము బానిసలమై, ఎంతకాలము మనము జీవితము గడిపినప్పటికినీ, ఏమాత్రము కూడనూ, అణుమాత్రము కూడనూ ఆత్మతత్త్వమును గుర్తిం చుకో లేమను సత్యమును వేదమే నిరూపించుచున్నది.

ప్రేమ స్వరూపులారా ! మనము ఇన్ని దినములు పశుపక్షి మృగాదులతో సంబంధించినటువంటి జ్ఞానము అభివృద్ధి కావించుకొనుచూ ఉండినంతకాలము, మనము సాధించేటటువంటి పవిత్రత ఏమాత్రమూ ఉండదు. పశుపక్షి మృగాదులతో కూడినటువంటి సమమైన జ్ఞానము ద్వారా కొంత విజ్ఞానములో చేరి, యీ విజ్ఞానము ద్వారా అనుభవ జ్ఞానములో కొంత వరకు ప్రవేశించినపుడే దివ్యత్వమైన ఆత్మతత్త్వము కానీ, పవిత్రమైన దివ్యత్వము కానీ మనము గుర్తించు టకు వీలవుతుందనే సత్యమును గుర్తించుట అత్యవస రము. ఆచరణ లేని గుణములు ఎన్ని ఉన్నప్పటికినీ ఇది గుణహీనమైనటువంటి దాని క్రిందనే చేరును తప్ప గుణవంతుడని చెప్పుటకు ఏ మాత్రమూ వీలుకాదు. ఈ అనుభవజ్ఞానమునకు కొంతవరకు పవిత్రమైన దీనిలో "నేను, నేను" అను స్థానమునుండి "మనము, మనము" అను ప్రదేశమునకు చేరు ప్రయత్నమునకు మనము ముందంజ వేయవలెను. "నేను అను స్థానము నుండి "మనము" అను స్థానమునకు ప్రయాణము చేయుటయే మానవుని జీవితము యొక్క పరమావధి. కానీ ఇట్టి సత్యమును మనము విస్మరించి, భౌతిక మైన జీవితములో, ధన కనక వస్తు వాహనాదులకు భ్రమించి మన జీవితమును చాల దుర్వినియోగపరచు కొనుచున్నాము. తినటానికి తిండి, ఉండటానికి ఇల్లు కట్టడానికి బట్ట, రోగము వచ్చిన, పోవుటకు మందు, ఇవి మనకు అత్యవసరమే, వీటిని సంపాదించుకునే నిమిత్తము కొంతచదువు కూడ అవసరమే. కానీ ఈ చదువును కేవలము ధనాశ నిమిత్తమై మనము ధార పోయుటము, మహా అవమాన కరమైన స్థితి ఈనాటి మహాపెద్దలైన విద్యావంతులు కూడను, మాణిక్యము వంటి మానవత్వమును మసి బొగ్గులకు అమ్ముకొనుట, ఈ తుచ్ఛమైన కాసులకు అమ్ముకొనుటకు ప్రయత్న ము చేయుచు, అధికారులయొక్క పాదాక్రాంతులై పోయి, వారి జీవితమునే బానిసత్వముగా అనుభవించు చున్నారు. ఇంకా మన భారతదేశములో సంపాదిం చుట తృప్తికాక, పరదేశములకుపోయి, అరబ్బు దేశ ములకు వెళ్ళి, అక్కడ పెద్దపెద్ద జీతములు వచ్చు చున్నవి, అనేక వాంఛలచేత తులతూగు మూర్ఖులు కూడను మన భారతదేశములో అభివృద్ధి యగుచు న్నారు. పట్టెడు అన్నము పొట్టలో వేసుకొనుటకు మన భారత దేశములో అవకాశము లేదా ? పవిత్ర మైన భారతదేశమునందు ఆ అన్నమును సంపాదించు టకు స్థానము లేదా ? ఎందుకు లేదు ? కానీ అధికమైన ధనమును ఆర్జించి, కడకు దొంగలకిత్తురో, దొరల కందురో, దానిని సంపాదించి ఎవరికి పెట్టవలెను. తాను ఉండి నంతవరకును సుఖపడవలెను ఉండినంత వరకును తాను ఆనందింపవలెను. పరులను ఆనంద పెట్టవలెను, పరులను సుఖపెట్టవలెను. ఆలాంటి సుఖ పెట్టనటువంటి ధనము, ఆనందపెట్టని ధనము, కేవ లము మట్టితో సమానము. ఆస్తికులకు నిజమైన ధనము జ్ఞానధనమే. దైవప్రేమ ధనమే. దైవానుగ్ర హధనమే. ఆ ధనమునకు మించినటువంటి ధనము మరొకటిలేదు. త్యాగరాజు చెప్పెను "రామా ! ఎన్ని గ్రహములు నన్ను బాధపెట్టి నప్పటికినీ నీ అనుగ్ర హము ఒక్కటుంటే నాకుచాలు" అన్నాడు. అదే

విధముగనే దైవానుగ్రహము ఒక్కటుంటే దైవ ప్రేమ ధనము ఒక్కటుంటే, దైవజ్ఞాన ధనము అనునది ఒక్కటుంటే ఈ ధనములన్నియు దానిముందు సూర్యునిముందు చిన్నదీపము వంటివి. "కారేరాజులు, రాజ్యముల్ గలుగరే, గర్వోన్నతిన్ పొందరే వారేరి?" ఎంతమంది చక్రవర్తులు మన భారతదేశమును ఏలినారు? ఎంతమంది మహారాజులంతా ఉండినారు. కాని వారందరూ ఎక్కడ ఉన్నారు ? ప్రతి మానవుడు కూడాను ఏదో ఒక కాలము ప్రాప్తించగనే కాయము వీడుట తప్పదు. కానీ ఈ కాయమును వీడక పూర్వమే మన కర్తవ్యమును గుర్తించి మన నిజతత్త్వమును మనము తెలిసికోవటమే పరమావధిగా భావించవలెను. దీనినే వేదాంత తత్త్వము అని తెలుపుతూ వచ్చిరి. మనము ఆచరణలో పెట్టిన తత్త్వము ప్రధానమయినది. పరులకు అందించువంటి తత్త్వము ప్రధానమయినది. ఆదర్శవంతమైన జీవితమును అందించటమే ప్రధానమయిన తత్త్వము ఆ తత్త్వమే దైవత్వము.

ఇంక అనేకమంది ఇంకొక తెగకు సంబంధించిన వారున్నారు ఈనాడు ఎప్పుడుచూచినా ఏదో గ్రంథములు చదవటమూ, కట్టలు కట్టలు గ్రంథములు చదువు చున్నారు. కానీ ఆ గ్రంథములలోనున్న ఒక్క పదమునైననూ ఆచరణలో పెట్టుటలేదు. ఇట్టి అచరణలో పెట్టని గ్రంథములు చదువువారు, దున్నపోతులతో సమానము. "పరిమళమును గార్థభముమోయ గజము అగునా" గంధపు చెక్కలు గాడిద మోయుచున్నది కానీ గంధపు చెక్కల వాసన దానికి ఏ మాత్రమూ తెలియదు అదే విధముగనే గ్రంథములు చదువుచున్నారు. కానీ ఈ పెద్దమనుషులు గ్రంథములలో యున్న పదములను ఒక్కటైనా ఆచరణలో పెట్టుటలేదు కనుక మనము తెలిసికొనినటువంటి విషయములను ఒకటి రెండు అయినా కూడా ఈనాటి నుంచి మనము ఆచరణలో పెట్టి విశాలమైన ప్రేమను అభివృద్ధిగావించుకొని మన భారత దేశము యొక్క ఆధ్యాత్మిక తత్త్వమును యావత్ దేశమునకు ప్రచారము చేయుటకు తగిన కంకణము కట్టుకోవాలని నేను ఆశించుచూ, ఆశీర్వదించుచూ నా ప్రసంగమును విరమించుచున్నాను.

ప్రశాంతి నిలయము

భగవాన్ దివ్యోపన్యాసము

8-10-78

# పుట్టినరోజు పండుగ

ప్రపంచమంతటా ఇరవైనాలుగు గంటల అఖండ భజన సాయంకాలం 6 గంటలకు ప్రారంభం కావడం తోటే స్వామి పుట్టినరోజు పండగ వేడుకలు ప్రారంభ మైనాయని చెప్పాలి. సూర్యాస్తమయం వేళ భజన ప్రారంభానికి ముందు వెలిగించిన దీపం నేలనాలుగు చెరగులా మానవకోటి హృదయ కుహరాల్లో చీకట్లను పారదోలి వెలుగులను విరజిమ్మింది.

నవంబరు 18వ తేదీన పుట్టపర్తి, చుట్టుపక్కల గ్రామాల ప్రజలు మహోత్సాహంతో వేణుగోపాల స్వామి రథోత్సవాన్ని సందర్శించడానికి వచ్చారు. గ్రామ చరిత్రకు దేవాలయ చరిత్రకూ విచిత్రమైన సంబంధం ఉంది. ఆలయంలో ప్రతిష్ఠితమై ఉన్న వేణుగోపాలస్వామి విగ్రహం మీద ఉన్న ఎర్రచారల ప్రత్యేకతను గురించి స్వామి ఒకసారి స్వర్ణోత్సవంలో వివరించి చెప్పారు. అప్పుడే ఉత్సవమూర్తిని ప్రతిష్ఠించి రథోత్సవాలను ప్రారంభించారు స్వామి. స్వామి దివ్య సమక్షంలో వేణుగోపాలమూర్తి దివ్యమంగళ విగ్రహాన్ని నేత్రపర్వంగా అలంకరించిన రథంలో ఉంచారు. వేలాదిమంది భక్తులు గ్రామప్రజలతో కలిసి రథోత్సవంలో పాల్గొన్నారు. మరుసటిరోజు తర్వాత రెండురోజులు కూడా రాత్రిపూట గ్రామం లోని ఆలయాల ఉత్సవమూర్తుల ఊరేగింపులు జరి గాయి. ఊరేగింపులు అలంకరించిన గ్రామవీధుల గుండా వెళ్లుతుండగా ప్రతిఇంటి ముందరా గృహస్థులు ఊరేగింపును ఆపి ధూపదీప నైవేద్యాలు సమర్పించి తమ భక్తి ప్రపత్తులను ప్రకటించారు.

స్వామి పుట్టినరోజు పండుగ పనులలో పాల్గొనే అవకాశం కోసం 19వ తేదీనాటికే వేలాదిమంది సత్య సాయి సేవాదళ్ స్వచ్ఛంద సేవకులు ప్రశాంతి నిలయం చేరుకున్నారు. భక్తులకోసం తెచ్చిన షామి యానాలు, టెంట్లు వేశారు. యావద్భారత దేశంనుండి సేవాదళ్ సభ్యులు-స్త్రీలు, పురుషులు నవంబరు 20, 21, 22 తేదీలలో ఏర్పాటైన అఖిల భారత సేవా దళ్ సమ్మేళనంలో పాల్గొనడానికి ముందుగానే వచ్చి తమతమ రాష్ట్రాల కన్వీనర్లవద్ద ప్రవేశానుమతి బ్యాడ్జీలు పుచ్చుకున్నారు.

20వ తేదీనాడు 10 వేలమందికిపైగా సేవాదళ సభ్యులు మందిరం చుట్టూ నలుగురేసి చొప్పున బారులు తీరినిల్చున్నారు. అనంతపురం మహిళా కళా శాల విద్యార్థినులు బ్యాండుబృందంతో ముందునడువగా మహిళా సేవాదళ సభ్యులు భజన పాటలు పాడుతూ వెంటనడిచారు. వారివెనుక సేవాదళ పురుషసభ్యులు ముందుకు నడిచారు. సాయంకాలం 4-30 గంటలకు ఊరేగింపు పూర్ణచంద్ర ఆడిటోరియం చేరుకున్నది. కేంద్ర, రాష్ట్ర ట్రస్టుల సభ్యులు, శ్రీ సత్యసాయి సేవా సంస్థల రాష్ట్రాధ్యక్షులు, మలేషియాకు చెందిన 18 మంది సేవాదళ సభ్యులు, మూడువందలకుపైగా విదేశాలనుండి వచ్చిన ప్రతినిధులు కూడా ఊరేగింపు లో ఉన్నారు.

భగవాన్ సేవాదళ సభ్యుల నుద్దేశించి చేసిన దివ్యోపన్యాసంలో "సేవ ఆధ్యాత్మిక సాధన అని

అది నిస్వార్థ నిర్మల హృదయంతో జరగాలని, అహంకార మమకారాలకు ఎంతమాత్రం చోటుండరాదని వివేకవిచక్షణలతో దానిని చేయాలని ఉద్బోధించారు. సేవ చేసేవ్యక్తి, ఆ సేవను స్వీకరించే వ్యక్తి ఉభయుల లోని ఏకత్వాన్ని గుర్తించే స్థితికి అది దారితీయాలని స్వామి సుబోధకంగా వివరించారు. ఆ తర్వాత శ్రీ సత్యసాయి సేవాదళ్ రాష్ట్ర కన్వీనర్లు తమతమ రాష్ట్రాలలో సాగుతున్న కార్యకలాపాల నివేదికలను స్వామి దివ్య సమక్షంలో సమ్మేళనానికి సమర్పించారు. గంగానదీ వరవాహక ప్రాంతంలోను ఇతర ప్రాంతాలలోను తాము వరదదెబ్బతిన్న స్థలాల్లో ఏ విధంగా సేవచేసినదీ ఉత్తర భారత రాష్ట్రాలవారు తమ నివేదికలో తెలిపారు. తదితరలు తమరాష్ట్రాలలో విద్యారంగంలోను, గ్రామీణసేవా రంగంలోను చేపట్టిన కార్యక్రమాలను వివరించారు.

21వ తేదీన ఉదయం 9 గంటలకు భగవాన్ ప్రశాంతి నిలయం కాలేజి భవనానికి శంకుస్థాపన చేశారు. ఆ స్థలాన్ని పరిశుభ్రంచేసి చక్కగా అలంకరించే సద్భాగ్యం సేవాదళ్ సభ్యులకు లభించింది. ప్రశాంతి నిలయానికి వచ్చేదారిలో, తూర్పువైపున ఈశ్వరమ్మ హైస్కూలుకు దక్షిణం వైపున కాలేజి భవన నిర్మాణాన్ని స్వామి సంకల్పించారు. బుల్‌డోజర్ల సహాయంతో స్థలాన్ని సమతలం చేశారు. వెనకవైపు కొండలతో ప్రకృతి సౌందర్యంతో అలరారుతున్న ఈ స్థలంలో నిర్మిస్తున్న కాలేజి అంతర్జాతీయ ఆధ్యాత్మిక కేంద్రమైన ప్రశాంతి నిలయ వాతావరణంతో అందరి దృష్టిని ఆకర్షించగలదు. 25 వేలమంది భక్తులు చేస్తున్న భజనలతో ఆకాశం ప్రతిధ్వనిస్తుండగా ఈశాన్య మూలలో తవ్వినచోట స్వామి కళాశాల భవనానికి పునాదిరాళ్ల నమర్చారు. తమ హస్తచాలనంతో వజ్రాలను, ఇతర వస్తువులను సృష్టించి నూతన విద్యామందిరం పునాదిరాళ్ళక్రింద ఉంచారు. మధురైకి చెందిన శ్రీ రామనాథన్ చెట్టియార్‌ను సతీ సమేతంగా కూర్చొని పూజ చేయడానికి స్వామి అనుగ్రహించారు. ఆడిటోరియం నిర్మించే స్థలంవద్ద ఈశాన్యమూలకు వారు స్వామి సమక్షంలో కూర్చొని పూజచేశారు. స్వామి అక్కడ పునాదిరాళ్ళ నమర్చారు. ఈశ్వరమ్మ హైస్కూలుకు పశ్చిమంవైపు నిర్మించబోతున్న విద్యార్థి వసతి గృహ నిర్మాణానికి భూమిపూజ చేయవలసినదిగా నావనగర్ రాజమాతను స్వామి ఆదేశించారు. ఈ భవనాలు నిర్మించబోతున్న సువిశాలమైన ప్రదేశ మంతటా ప్రపంచ మంతటినుండి వచ్చిన వేలాదిమంది భక్తులు చేత నూతన విద్యామందిర శంకుస్థాపన దృశ్యాల్ని కన్నుల పండువుగా చూసి ఆనందించారు.

తిరిగి ఉదయం 10-30 గంటలకు సమ్మేళనం కార్యక్రమం ప్రారంభం కాగా సేవాదళ్ రాష్ట్ర కన్వీనర్లలోనుండి ఎంపికచేసిన అష్టవు ప్రసంగించారు. సేవాదళ్ సభ్యుని విధులు-బాధ్యతలు, "సేవా కార్యక్రమాలలోని విశిష్టత," సేవా కార్యక్రమాల విస్తరణ"-ఈ మూడు అంశాలలో ఒక్కొక్క విషయం మీద ఇద్దరేసి చొప్పున ప్రసంగించారు. సేవను ఆధ్యాత్మిక సాధనగా భావించి చేయాలని చెబుతూ మానసిక సేవ ప్రాధాన్యాన్ని వివరించారు. సేవాదళ్ సభ్యులు భజన, నగర సంకీర్తనలలో పాల్గొనడమే గాక ఉపధ్యానముల సాధన కూడా చేయాలని వారు తమ ప్రసంగాలలో చెప్పారు. సేవాదళ్ ప్రజలతో సన్నిహిత సంబంధం, వారిపై ఎంతో ప్రభావం ఉన్న సంస్థా విభాగం కాబట్టి సేవ ఎంతో నైపుణ్యంతో చేయాలని, సేవచేసే వారికిగాక ఎవరికి సేవ చేస్తున్నారో వారికికూడా పూర్తిగా సంతృప్తి కలుగాలని సేవకుడు అణకువ వినయం కలిగి ఉండాలని చేసేపనిపట్ల శ్రద్ధా భక్తులు కలవాడై ఉండాలని

వారన్నారు. సేవా కార్యక్రమాల విస్తరణ విషయంలో "ప్రీసేవాదళ్" సేవాదళ పూర్వస్థాయి వరకు బాలబాలికలందరినీ బాలవికాస్‌లలో కొనసాగేందుకు ప్రోత్సహించాలని వారు సూచించారు. 35 సంవత్సరాలలోపు వయస్సుగలవారికి మాత్రమే సభ్యత్వాన్ని పరిమితం చేయాలనీ, శిక్షణపొంది ఉత్సాహవంతులైన సేవకులుగా తయారైనవారు తమ శక్తిసామర్థ్యాలను ఉపయోగించే పరిస్థితిలో ఉన్నంతకాలం సభ్యులుగా ఉండవచ్చునని వారు సూచించారు.

ఆరోజు మధ్యాహ్నం 2-30 గంటలకు రాష్ట్రాధ్యక్షులు సేవాదళ్ జిల్లా కన్వీనర్లను సమావేశపరచి సేవాదళ శిక్షణ, సాయిసాహిత్య విక్రయం, ప్రథమ చికిత్స, గ్రామీణ సేవా విస్తరణ మొదలైన విషయాలమీద ఉదయంపూట వచ్చిన వివిధ అంశాల గురించి బృంద గోష్ఠులను రాష్ట్ర కన్వీనర్ల నాయకత్వంలో నిర్వహించారు. చర్చలలో ప్రతిపాదించిన ముఖ్యసూచనలను సాయంత్రం 5 గంటలకు స్వామి సమక్షంలో జరిగిన సర్వసభ్య సమావేశంలో నివేదించడానికి రాష్ట్రవిభాగాలు తమ తమ ప్రతినిధులను నియమించినవి.

సేవాదళ సమ్మేళనం ముగింపు ముందు స్వామి పదివేల మంది సేవాదళ కార్యకర్తలకు సందేశాన్నిస్తూ ప్రాచీన సనాతన ధర్మానికి ఆధునీకృత రూపమైన సాయిధర్మాన్ని తాము ఆచరిస్తూ ప్రబోధించడానికి పూనుకోవాలని సేవాదళ్ సభ్యుల నుద్బోధించారు. "ప్రతిప్రాణిలోనూ ఉన్న సర్వవ్యాపియైన పరమాత్మను గుర్తించి ఆ విశ్వాసంతోనే సర్వ ప్రాణులకూ సేవచేయాలన్నారు." అనుమాన ఆందోళనలకు చోటివ్వకుండా వేళాకోళం, వ్యతిరేకత, నిర్లక్ష్యం మొదలైన అవరోధాల నన్నిటినీ భక్తిభావం వల్లవచ్చే ధైర్యసాహసాలతో అధిగమించండి. ఎదురయ్యే ఇబ్బందులు మీ భక్తికి వన్నెపెట్టడానికి భగవంతుడు పెట్టినపరీక్షలుగా, మీ విశ్వాసానికి సవాలుగా భావించి వాటిని ఎదుర్కొనండి. రకరకాల సేవచేయడం ద్వారా కాదు భగవదనుగ్రహం లభించేది; నిర్మలమైన నిస్వార్థమైన భావంతో చేసే సేవద్వారామాత్రమే అది లభిస్తుంది"—అని స్వామి ఉపదేశించారు. సేవగురించి సభ్యులు చేసిన సూచనలను స్వామి ప్రస్తావిస్తూ ఇలా అన్నారు. "ఢిల్లీనుంచి వచ్చిన రాజేష్‌ఖన్నా ప్రతి సభ్యుడూ తన దగ్గర ఉంచుకోవడానికి అవసరమైనప్పుడు ఉపయోగించడానికి వీలుగాఉన్న చిన్న ప్రథమ చికిత్సపెట్టెను చూపించాడు, ఇదిమంచి సూచన. మందులు, పత్తి, బ్యాండేజి ఇంకా ఇతర వస్తువులు ఎప్పుడంటే అప్పుడు అందుబాటులో ఉంటాయి. బాగానే ఉంది. మరోరకమైన ఫస్ట్ ఎయిడ్ బాక్స్ దగ్గరపెట్టుకోవాలని మిమ్మల్ని కోరుతున్నాను. ద్వేషం, దురాశ, కాంక్షఅనే అతి తీవ్రమైన మానసిక వ్యాధులను కుదర్చడానికి తోడ్పడుతుందది. అందులో "విచక్షణ" అనేకొన్ని మాత్రలు, ఒక ఔన్సుఆరో ఇంద్రియనిగ్రహం," ఒకటోరెండో "శాంతి", "ప్రేమ" "సహనం" అన్నిటినీ పౌడర్‌చేసి బాగా మిక్స్‌చేసి కట్టిన పేకెట్లు ఉండాలి. సకాలంలో ఈ మందుల్ని ఉపయోగించి అజ్ఞానమనే వ్యాధిని కుదర్చ వచ్చు." వివిధ రాష్ట్రాల్లో సమితులు దత్తత తీసుకున్న గ్రామాల్లో సాగిస్తున్న సేవగురించి నివేదికలలో వివరించిన కార్యక్రమాల విషయంలో ప్రస్తావిస్తూ స్వామి ఇలాఅన్నారు. 'కొంతదూరం రోడ్డు నిర్మించడం లేక మరమ్మతు చేయడం, మురుగు కాలువలు శుభ్రం చేయడం, వైద్యపరీక్షలు చేయడం, భజనలు, ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం—వీటికి అంతగా ప్రాముఖ్యంలేదు. శ్రీ సత్యసాయి సేవాదళ్ అంతకంటే ఎన్నోరెట్లు విలువగల సేవచేయాలి. జూదం, త్రాగుడు దురవాట్లవల్ల సమాజంలో కుటుంబాల్లో కలిగే

అనర్థాలను గమనించి వాటిని మాన్పించడానికి వ్యక్తిగతంగా గానీ సామూహికంగా గానీ ప్రయత్నించి ప్రజల నైతిక స్థితిని అలవాట్లను సంస్కరించాలి. అది నిజమైన గ్రామీణ అభివృద్ధి. ఈ నైతిక సంస్కరణ తీసుకు రానట్లయితే అభివృద్ధి పథకాలవల్ల వారి ఆదాయం ఎంతగా పెరిగినప్పటికీ అదనపు అర్జన అంతా త్రాగుడు, జూదం వంటి వ్యసనాల వైపు అధిక ప్రేరేపణకే దారితీస్తుంది."-"ప్రతిదళం కూడానాకు చెందినదే, నానుండి చైతన్యం, శక్తి ఉత్సాహం అవి పొందుతాయి"-అని ప్రకటిస్తూ భగవాన్ సేవాదళసభ్యులనందరినీ ఆశీర్వదించారు. వారందరికీ పాద నమస్కారావకాశాన్ని అనుగ్రహించారు.

మూడు రోజులూ సాయంత్రం వేళల్లో మద్రాసు. చీరాల బాలవికాస్ పిల్లలు, ఊటీ నందనవనం శ్రీ సత్య సాయి విద్యా విహార్‌కు చెందిన చిన్నారి బాలలు నృత్యాలు, నాటికలు, పాటలు, ఆధ్యాత్మిక ఇతి వృత్తాలుగల నాటకాలు ప్రదర్శించి సభికుల మనసుల్ని రంజింపజేశారు. బెంగుళూరులోని శ్రీ సత్య సాయి కళాశాల విద్యార్థులు కాలేజీలో భగవాన్ మార్గ దర్శకత్వంలో ఆధునిక కాలపు విద్యార్థులు ఏవిధంగా పరివర్తన చెందుతున్నారో చూపే హిందీ నాటికను ప్రదర్శించారు.

నవంబరు 23వ తేదీన స్వామి 58వ పుట్టినరోజు. పండుగ వాతావరణంతో ప్రకృతి కళకళ లాడుతుండగా ప్రశాంతి మందిరంమీద సత్య ధర్మశాంతి ప్రేమల పతాకం రెపరెపలాడింది. బెంగళూరునుండి వచ్చిన మిలటరీ బ్యాండు వెనుక స్వామి ఊరేగింపుతో ముందుకు నడిచారు మాతా పితృల సమాధులవైపు. "నా జీవితమే నా సందేశం" అంటారు స్వామి. తమ తల్లిదండ్రులను పూజించాలని స్వామి ఆచరణ ద్వారా బోధిస్తున్నారు. ఆ తర్వాత ఉదయం 10 గంటలకు ప్రపంచమంతటి నుంచీ వచ్చిన 25000 మంది భక్తులు పూర్ణచంద్ర ఆడిటోరియంలోను చుట్టు ప్రక్కల నిండిపోయారు. సెంట్రల్‌ట్రస్టు సభ్యులు విద్యాసంస్థల అధ్యక్షులు స్వామికి భక్తి పురస్సరంగా పూలమాలలు సమర్పించారు. ఆ తర్వాత స్వామి జన్మదిన సందేశమిచ్చారు. తాను దేశ కాలాలకు అతీతుడనని, తనకు జననంకాని మరణంకాని లేవని, "Happy Birthday for you" అని తనకు రోజున శుభాకాంక్షలు తెలుపడం సందర్భోచితంకాదని ఏడాదికొకరోజునకాదు; తానెల్లప్పుడూ ఆనందంగానే ఉంటానని స్వామి జన్మదిన సందేశంలో స్పష్టీకరించారు. ప్రయాణంలో తీవ్రమైన ఇబ్బందుల నెదుర్కొంటూ కూడా వేలాదిమంది ఇక్కడ చేరారు కాబట్టి పుట్టినరోజుపండుగ జరుపుతున్నాం.పుట్టినరోజుపండుగ కోసం మీరంతా చేరడంలేదు. మీరంతా చేరారు కాబట్టి పుట్టినరోజు పండుగ జరుగుతున్నది. అదే నిజం-" అని స్వామి ప్రకటించారు. "పుట్టినరోజు పండుగ వంటి సామాన్య విషయాలమీద నాకాసక్తిలేదు. శరీర బంధనాలనుండి మీరు విముక్తులై అంతరాంతరాల్లో ఉన్న భగవంతునిమీద మీకు ఆసక్తి జనించిననాడు మీరుతప్పక పుట్టినరోజుపండుగ చేసుకోవచ్చు ఎందు చేతనంటే అప్పటినుండి నేను మీవెంటనే మీలోపలనే ఉంటూ మీకు దారి చూపుతూ మిమ్మల్ని కాపాడుతూ ఉంటాను కనుక".

కంటికి కనిపించే భిన్నత్వం వెనుకనున్న ఏకత్వాన్ని దర్శించడం చాలా ముఖ్యమని స్వామి నొక్కి చెప్పారు. "విజ్ఞానం పెరిగినకొద్దీ సంపూర్ణ విషయ పరిజ్ఞానంకంటే విషయంశాల విశేషజ్ఞానార్జనకు ప్రాధాన్యం పెరుగుతున్నది. కొందరు డాక్టర్లు హృదయసంబంధ వ్యాధులకు మాత్రమే చికిత్సచేస్తే మరికొందరు కన్ను, చెవి, గొంతు, చర్మము, లివరు చెస్టు మొదలైన వేర్వేరు శరీర భాగాల వ్యాధులకు

మాత్రమే చికిత్సచేస్తారు. అట్లే అన్నిదేశాలు, ప్రజలు ఒకే పరమాత్మ దేహానికి అవయవాలు. రంగు, జాతి భేదాలనుచూసి అందరిలోనూ ఉన్న దివ్యత్వాన్ని విస్మరించవద్దు. గుడ్డినమ్మకాల్ని అంతమొందించా లనేవాళ్ళున్నారు. మనం చూసే, కనుగొనేవస్తువులను, విషయాలను మాత్రమే నమ్మాలని వారు వాదిస్తారు. ఈ రెండు ప్రమాణాలను బట్టే తనతండ్రిని గుర్తించ గలుగుతున్నాడా? తల్లిమీద ఉన్న విశ్వాసాన్ని బట్టే కదా అతను ఒక వ్యక్తిని తన తండ్రిగా గుర్తించేది. వీరికి పత్రికల ఎడిటర్లమీద, విలేకరుల మీద, చలన చిత్రనిర్మాతమీద విశ్వాసంఉంది.కాని ఈ విశ్వాసాన్ని ఒక పథకం ఒక క్రమం ప్రకారం ఏదో అతీంద్రియ మైన శక్తి నడుపుతున్నదని ప్రకృతి వేనోళ్ళ చాటు తున్న సత్యాన్ని మాత్రం వీళ్ళునమ్మరు"—అని స్వామి వివరించారు.

సాయంత్రం స్వామి ఉయ్యాలోత్సవాన్ని కన్నుల పండువుగా చూచి ఆనందించే అవకాశం భక్తులకు లభించింది. ఉయ్యాలోత్సవానికి ముందు ప్రముఖ వేణుగాన విద్వాంసుడు శ్రీ విజయ రాఘవ రావు మృదు మధురంగా వేణుగానం వినిపించారు.

మద్రాసుకు చెందిన సుప్రసిద్ధ గాయనీమణులు శ్రీమతి రాధ, శ్రీమతి జయలక్ష్మి భజనకీర్తనలు అద్భుతంగాపాడి భక్తుల మనసులనరింపజేశారు. వారు పాడిన హిందీ భజన పాటల స్టీరియో రికార్డును ఈసందర్భంగా విడుదలచేశారు. స్వామి ఉయ్యాలలో కూర్చొని దివ్యత్వపు కాంతి పుంజంవలె వెలుగుతూ వేలాదిమంది భక్తుల హృదయాలను ఆనంద పార వశ్యంలో ముంచెత్తుతుండగా బెంగుళూరు సత్యసాయి కళాశాల విద్యార్థులు తమ స్వంత ఆర్కెస్ట్రా సహా యంతో తెలుగులో రామకథను రసవత్తరంగా గానం చేసి భక్తులను ఆనంద పరవశులను చేశారు. సుప్ర సిద్ధ సంగీత దర్శకుడు శ్రీ ఆదినారాయణరావు సంగీ తం సమకూర్చిన సత్యసాయి కథాగానం ఈసారి కార్యక్రమాలలో ప్రత్యేకాకర్షణ.రూపక్ చాంగ్‌కాకోటి ఆయన సహచరుల ఆర్కెస్ట్రా భక్తుల ప్రశంసల నందుకున్నది.

# అనాథ నాథుడు, శ్రీనాథు లోకనాథు, సచ్చిదానందమూర్తి, పుట్టపర్తి సత్యసాయి సత్చక్రవర్తి

తల్లి వడిలో నిర్విచారముగా నిర్భయముగా నున్న పసిపాపలను చూచిన ఆ ఆనంద తాండవమాడుచున్న ముఖారవిందముయొక్క ప్రకాశము, ప్రశాంతమును చూచిన ఎంతశాంతి ఎంత సంతోషము! మానవుని యొక్క శాంతి ఆనందములను హరించే ఈర్ష్య అసూయలు కామ క్రోధములు రాగ ద్వేషములు అహంకారములు ఆడంబరములు పసిపాప హృదయమున చేరుటకు అవకాశములేదు. భవిష్యత్తునుగురించి భయాందోళనములు పసిపాపకు లేవు. మిన్నువిరిగి పైన పడిననూ దానిశాంతికి భంగము కలిగించదు తల్లి ఒడిలో ఆనందముగా పండుకొని యుండును.

ఇట్టి శాంతి ఆనందములు పెద్దవారికి లేవే? కారణ మేమిటి? పెరిగి పెద్దవారయ్యే కొద్ది ఇంద్రియములకు లోబడి జీవితమందు అనేకత్వమును అభివృద్ధి చేసుకొని అశాంతిని అనుభవిస్తూ నిర్మలత్వమును కోల్పోయిబలహీనతకుబానిసలై దు.ఖమే అధికమగును. పెద్దవారి దృష్టి దృశ్యకల్పితమైన జగత్తుపైనే వుండును. క్షణమాత్రము దొరకే ఆనందనిమిత్తమై నిరంతర తాపత్రయములో అంతులేని ఆతురతతోపడి ఇంద్రియములవెంట పరిగెత్తి జీవితమును వ్యర్థము గావించుకొందురు. తెలివితేటలు పెరిగినంత మాత్రమున ఏకత్వమునందు అనేకత్వమే గోచరమగును. "ముండే ముండే యతిర్భిన్నాః" అన్నట్లు భేద భావాలు భిన్నాభిప్రాయాలు ఉహాచిత్రాలు అధికమై పవిత్రత, దివ్యత్వము, ఏకత్వము, మొదలగు దివ్య గుణములు తగ్గును. ఏక స్వరూపముగా వుండిన దేహమును ఉదరము,హస్తము, నేత్రము, శ్రోత్రము అని వేరు వేరు జేసి అనేకత్వ దృష్టిచే శుశ్రూషించిన, లాభములేదు; వీటియొక్క సమ్మిళిత సంబంధమును గుర్తించి వర్తించే అవసరమున్నది.

దేహము, వ్యక్తులు, జీవులు మూడింటియొక్క సమ్మిళితమైన స్వరూపమే, ఆత్మ! సంకుచిత భావముతో నూతన పరిశోధనా మార్గముల నవలంభించి చిక్కిన అల్ప ఫలితములకు విజ్ఞానశాస్త్రజ్ఞులు పెద్ద జయమును పొందినామని భ్రమించుచున్నారు. చిన్న చిన్న ఫలితములవలన, వారి బుద్ధి యొక్క చిన్న చిన్న తనముకూడ పెరుగుతూ వుండును. వైద్యులు ఎముకలు, చెవి, ముక్కు, గొంతు, హృదయము, కడుపు, చర్మము అని దేహమును ముక్కలుచేసి, ప్రత్యేకముగా వాటివాటికి తగిన పరిహారములను విధింతురు.

భక్తులు కూడ ఇంతే. వారిలో ఎక్కువమంది యుక్తులు భుక్తులు! ఒకరికన్న మరొకరికి అజ్ఞానమునందు ప్రథమస్థానము కావాలి. అనే పైపోటీలో "నా దేవుడు" "నీదేవుడు", "గణపతిపెద్ద" "హనుమంతుడు పెద్ద" అని భిన్నాభిప్రాయాలను పెంచుకొని కలహింతురు. దేనికి తోడు నా పరమాత్ముడు కూడ ఏకోహం బహుస్యాల అని మానవుని కి దివ్యత్వమును భిన్న భిన్న రూపములలో చూపించును. అనుభవజ్ఞులైన పెద్దలు మానవు లందరిలోనూ ప్రకాశించుచున్న దివ్యత్వమును గుర్తింతురు.

ఆధ్యాత్మిక మార్గమునందు నమ్మకము చాలా ప్రధానము. జనన మరణముల మధ్య పతనమైన అనుభవముల నందుకొని మానవుడు నమ్మరాని వాటిని నమ్ముతున్నాడు. నమ్మతగినదాన్ని నమ్మటములేదు. వివేక విచక్షణలను కోల్పోయి బాధపడుచున్నాడు.

అమ్మవడిలోని పాప అమ్మపైఉన్న నమ్మకము వలన అతడు నా తండ్రి, ఇతడు నా తాత, ఈమె అక్కయని అమ్మ చూపించిన వ్యక్తులను ఆ పేరు తోనే పిలుచును. "ఇతడు నీ తండ్రి" అనే మాటపై నిర్మల నిశ్చల నిస్వార్థ బుద్ధితో విశ్వసించును. తల్లి చెప్పకుండిన, తండ్రి యెవరని వేరెవరు చెప్పగలరు? అట్లనే, ప్రకృతి మాతా సృష్టికర్త ఒకడున్నాడు. అతడే జగత్పతి అని చెపుతూవుంటే ఆమెను విశ్వసించక, ఉన్నాడా లేదా అనే వాదోపవాదములను పెంచుకుంటు పోతున్నారు. అమ్మ అనిన ప్రకృతిని విశ్వసించుచూ అప్ప అయిన దేవుని నమ్మక "మాతల్లి గొడ్డురాలు" అని లోకానికి చాటుచున్నారు.

అన్నిటినీ విశ్వాసముతోనే చేయుచున్నాము. ఒక మంగలివాడి దగ్గరకుపోయి, ఆయనదగ్గర పదునైన కత్తి ఉందని తెలిసి వెనుకకు రాము! ఆయన అపకారము చేయడు అనే విశ్వాసముతో చేతికి తలనందిస్తున్నాము. ప్రతివాడూ తాను ఘనుల

యందు విశ్వసించియే ఆనందము ననుభవించుచున్నాము. చాకలి మన వస్త్రములను శుభ్రపరచి ఇస్త్రీచేసి ఇస్తాడని విశ్వసించికదా, విలువైన గుడ్డలను ఇస్తున్నాము. ఆ విశ్వాసములేక, గుడ్డలు పరిశుద్ధముకావు; మన మనస్సులుకూడ పరిశుద్ధము కావు

అట్లనే దేహిని విశ్వసించి ఆనందమునందుకోవాలి. దీనిలో అనుకరణముతప్పు. పరులమాట నమ్మకూడదు. తామే స్వయముగా అనుభవించాలి, అని భ్రాంతిపడుతున్నారు. మాతృమూర్తిపై విశ్వాసమువలన తండ్రిఅని ఒకరిని నమ్మినట్లు ప్రకృతిలో సర్వ వ్యాపకమైయున్న శక్తిని దివ్యత్వమని విశ్వసించాలి. ఎక్కడో జరిగిన విషయమును గురించి పేపరులో వార్త వచ్చిన, దానిని చూడగనే ప్రత్యక్షముగా గుర్తించకనే, ఆ ఎడిటర్‌పైన విశ్వాసమునచే, మంచి విషయముంటే ఉప్పొంగిపోతున్నాము; లేకపోతే, కృంగిపోవుచున్నాము!

కథల రచయితలు వ్రాసే కథలలోని ఉల్లాసముగాని,లేక నిరాశనిస్పృహగాని చదువరులనూ బాధించుచున్నవి. రుచికరమైన సినిమాలు చూపించే కల్పిత దృశ్యాలను సమముగా భావించి జాలి విచారము భయ భ్రాంతులు ఉద్రేకము ఉల్లాసము ఇచ్చి రకరకాల భావాలు మనలో ఆవిర్భవించును. సినిమా డైరెక్టరుని, ఎడిటర్ని, కథలురాసే వాళ్ళని నమ్ముతారేగాని రక్షించి శిక్షించి పెంచి పరిపాలించే జగదీశ్వరుని నమ్మకున్నారు. మాటల మ్యాజిక్కుకు లొంగుదురే కానీ, మంత్రములను నమ్మి హృదయములోని దివ్యత్వమును కనుగొనుటకు ప్రయత్నింపరు. ఒకమాట ఎన్నడూ నిజము. నమ్మి చెడినవారు ఏనాడు లేరు.

భగవంతుని విశ్వసించి శాంతి సంతోషముతో జీవితమంతా ఆనందముగా గడపిన కోటానుకోట్లు భారతీయులు గలరు. నాస్తికత్వము విప్లవకారి; అయితే, ఆస్తికత్వమును అభివృద్ధిచేయుటకే నాస్తికము వచ్చినదని నమ్మండి. చీకటి లేకపోయిన, వెల్తురుకు విలువ ఉండదు. ఆకలి లేకపోతే అన్నము నెవరాశింతురు? మరణమె లేకపోతే, తల్లికూడ తన బిడ్డను ప్రేమించదు. స్వార్థమే దీనికి మూలకారణము. అసలు దైవమును విస్మరింతురు; నెరవేరకుండిన దైవముపై ద్వేషభావము! కనుక, స్వార్థ రహితమైన మార్గము ననుసరించిన దివ్యానుగ్రహము తప్పక కలుగును. "అడుగకువే! ఓ మనసా!" అని హెచ్చరించినాడు. అర్హతను సంపాదించినచాలు కోరనక్కరలేదు. శబరి దేన్ని అడిగెనది! జగము దేన్ని కోరినది? పవిత్రత, యోగ్యత రెండూ ఉంటే, తానే నడిచి వస్తాడు. చిత్తశుద్ధి ఇంద్రియ నిగ్రహములుంటే దైవానుగ్రహము తప్పక లభ్యమును. సుఖశాంతుల నందుకో వచ్చును. దీనికేమాత్రమూ సందియము లేదు.

నిజమైన ఆనందము బాహ్య ప్రపంచమునందు దొరకదని తెలియక, కాలమునూ, కాయమునూ వ్యర్థముచేయుచున్నారు మానవులు. కుటుంబపోషణలో బంధుమిత్రుల ఆదరణలో, సుఖములేదు తన హృదయమందే దాగియున్నది. కుటుంబ వ్యామోహమువలన ఎంతోమంది పెడమార్గము పడి జార చోరులుగా తయారగుచున్నారు. దేహభ్రాంతి ఉన్నంత వరకూ బలహీనత తప్పినదికాదు. దేహి స్వరూపమునే అర్థించాలి, ఆరాధించాలి, ఆనందించాలి,

యోగశక్తి క్రియాశక్తి ఆత్మశక్తి ఇవి మూడూ సమ్మిళితమైనదే అవతార తత్వము. అవతరణమనిన పై స్థానంనుంచి క్రింది స్థానానికి రావటము అనికాదు, అర్థము. గుణస్వరూపుడైన మానవుని ఉద్ధరించుటకు గుణ స్వరూపుడుగానే రావలెను. దీనివలన భగవత్ తత్వమునకు కించిత్వము నేమాత్రమూ ఆరోపించ

కూడదు. చంటిబిడ్డ ఏడ్చినపుడు తల్లి చేతిలోనికి ఎగురుట దానికి సాధ్యముకాదు. నేనుపెద్దదాన్ని అని తల్లి వంగును. అంతే ఎట్లా? వంగిన మాత్రమున లొంగినట్లుకాదు. మానవుడు పైకి ఎగురుట సాధ్యము కానప్పుడు సాయిమాత వంగి ఎత్తుకొని సంతోషము నందించును. ఏరోప్లేను ఎప్పుడూ పైనే ఎగురుటకు ప్రయత్నించును ఇతరే వాహనాదులవలె నేలపై సంచరించదు. అయితే సదా సర్వత్ర పైనే సంచరించదు. అక్కడక్కడ దానిలో ప్రయాణించుటకు అర్హత సంపాదించిన వారిని ఎక్కించుకొని తిరిగి పైకి వెళ్ళును. భగవంతుడు గుణాతీతుడు, ఎక్కడో వున్నాడు దొరకడు అని లేదు అనిలేదు భగవంతుని పొందే అర్హత కలిగినవారికి వారికి ఆనందమునిచ్చే తరుసు పక్వఫలము వృక్షమునుండి వేరయ్యేరీతి జ్ఞాను లందరూ తరింతురు. అయితే సంచితానికి వడ్డీ పెంచుకొని దుష్కర్మలద్వారా దుఃఖమును పెంచకూడదు.

మీహృదయమునందు మీరెప్పుడు దివ్యమైన ఆనందమునందు కొందురో, అదే సాయి పుట్టిన దినము. ఇంకొక సత్యము మీకు ఈనాడు వెల్లడించాలి. పుట్టపర్తిలో పుట్టిన పండుగ చేస్తున్నారు కాబట్టి మేము వస్తున్నాము అని భావించిన, అది సరికాదు. మీరు రావటముచేత పుట్టినపండుగ చేస్తున్నాము. అంతే పుట్టిననాడు పండుగ చేసుకోవాలి అనే ఆశలు నాకే నాడూ లేవు. అనేక దేశాలనుంచి ఎన్నో కష్టాలకు నష్టాలకు గురియై మీరు రావటముచేత, మీకు ఆనందమందించాలి అనే భావమే తప్ప నాలో ఇట్టి చిల్లర భావాలు ఏనాడూ ఆవిర్భవించవు. లోకాస్సమస్తాస్సుఖినో భవంతు అనే విశ్వస్వరూపాన్ని గుర్తించి అందరికీ సంతోషము సంతృప్తి కలుగాలి అనే భావము ఉత్సాహము ఆవేదన మీ హృదయములో ఏనాడు పుట్టునో ఆనాడు ఆ హృదయము సాయిమందిరముగా విరాజిల్లును. ఆ నాటినుంచి మీరెక్కడోనేనక్కడే! ఈ దినము ఉదయమునుంచి నా దగ్గరకు వచ్చిన వారెందరో **Happy Birthday** అన్నారు! నా **Happy Birthday**కి రానక్కరలేదు నేను నిరంతరమూ **Happy**లోనే వున్నాను నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం ఏకం నిత్యం విమలం అచలం సర్వధీ సాక్షిభూతం భావాతీతం త్రిగుణరహితం—దానికెప్పుడూ ఆనందమే ఎప్పుడూ **Happy**యే.

23-11-78

— శ్రీవారి దివ్యోపన్యాసము

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 4. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 5. | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 6. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 7. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 8. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 9. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 10. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 11. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 12. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 13. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 14. | భజనావళి | 2-00 | 0-20 |
| 15. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయి |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన' రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంప బడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : 24 వ పుటలో చూడండి )

సాధకులునూ, ఆస్తికులునూ అయిన మీరు ఈ కామక్రోధ లోభములను సాధ్యమైనంతవరకు అరికట్టి, తద్వారా మన పవిత్రతను, అంతర్వాహినియయిన ఆనందతత్వాన్ని కొంతవరకు చవిచూడడానికి తగిన ప్రయత్నం చేయటం అత్యవసరము. ఈమూడు రకములైన దుర్గుణములకు కూడను ఈమూడు రకములైన శత్రువులకున్ను మనయొక్క సంకల్పములే మూలకారణం. వీని కన్నింటికిని మనస్సు యొక్క చమత్కారమే ఆధారము. కనుక మొట్టమొదట మనస్సును అరికట్టటానికి తగిన ప్రయత్నము చేయటము మానవుని యొక్క కర్తవ్యము. మనస్సును విచ్చలవిడిగా ప్రసరించడానికిగాని, ప్రయాణించడానికిగాని మనము ఏమాత్రము కూడను అనుమతించకూడదు. ఎట్టి చిన్నకార్యము చేయవలసి వచ్చినా, నిత్య అనిత్య విషయాన్ని పరిశీలనచేసి, ఇది గౌరవమా, అగౌరవమా, మానవత్వానికి శోభను తెచ్చునా లేక అగౌరవము కల్గించునా అనే విషయాన్ని విచారించి ఈ మనస్సును తగిన రీతిగా మనము కొంత ప్రయాణము సల్పించటానికి పూనుకోవాలి.

—బాబా